॥ ఓం ॥

# శ్రీరంగం దేవాలయం నిర్మాణం

## సిద్ధుల పద్ధతిలో తత్త్వ వివరణ



స్వర్ణవిమానం - పరవాసుదేవులు


రచయిత :

శ్రీ రంగం సిద్ధర్

శ్రీ అంబాళ్ పరిమళ శాల

227, తూర్పు ఆడై యవళంజాన్ రోడ్డు,

శ్రీరంగం - 620 006.


 [వెల : రూ. 4-50]

# విషయసూచిక

॥ ఓం ॥

# శ్రీరంగం దేవాలయం నిర్మాణం

## సిద్ధుల పద్ధతిలో తత్త్వ వివరణ


రచయిత :

శ్రీ రంగం సిద్ధర్

శ్రీ అంబాళ్ పరిమళ శాల

227, తూర్పు అడ్డై వళంజాన్ రోడ్డు,

శ్రీరంగం, తిరుచిరాపల్లి - 620 006.



తెలుగు అనువాదం :

శ్రీ తిరుమల రామచంద్ర

హైదరాబాద్ - 500 385.




[వెల : రూ. 4-50

# మనవి మాటలు

"దేహో దేవాలయః ప్రోక్తః" దేహమే దేవాలయం అన్నారు, సాధకులైన యోగులు. దేహంలోని మూలాధారం మొదలు సహస్రారం వరకు ఉన్న స్థితిపై ప్రాణాయమంతో ప్రాబల్యం సాధించి అమృత బిందు సంయోగానికి ఆయత్తుడవుతాడు యోగి. ఈ దేహాన్ని బట్టే ఆగమ శాస్త్రజ్ఞులు దేవాలయాన్ని రూపొందించారు. ఈ కోవెలలోని గోపురాలు, మెట్లు, శిల్పాలు, స్తంభాలు, తీర్థాలు, ఉత్సవాలు, వాహనాలు, నిత్యపూజా నైవేద్యాలు — అన్నీ యోగ దృష్టిలో ఏర్పరచినట్టివి. కాలక్రమాన ఈ దృష్టి అంతరించింది.

శ్రీరంగం సిద్ధర్ గారు యోగ దృష్టితో వీటిని పరిశీలించి ఈ చిన్న పుస్తకంలో వివరించారు. వీరు ఐహిక సుఖాలను త్యజించి సంపూర్ణంగా ఆముష్మిక సుఖలోలురైనవారు. చాలాకాలం మౌనం పాటించి, సిద్ధుల సంప్రదాయంలో సాధన చేసి, సిద్ధులు పొందిన వారు, ప్రాణాయామం అన్నిటికి వజ్రాయుధం వంటిదని వీరి సిద్ధాంతం. ప్రాణాయామంతో ఎంతటి పనినైనా సాధించవచ్చునని వీరి విశ్వాసం. ఈ ప్రాణాయామానికి శ్రీరంగం దేవాలయ నిర్మాణంలో ఎంతటి ప్రాధాన్యం ఉందో, దేవాలయం లోని ఏయే ప్రాంతాలు ఎలా యోగ విషయాలు సూచిస్తాయో వివరించారు వీరు. ఇదంతా ఈ సిద్ధర్ గారి మౌలిక పరిశీలన ఫలితం. వీరి పరిశీలన పండితులకు ఆలోచనను, పామరులకు జ్ఞానాన్ని కలిగిస్తుంది. ఇదొక గొప్ప ఆగమ యోగ సమన్వయ సిద్ధాంతం.

ఇట్టి ఉత్తమ పుస్తకాన్ని తమిళభాష నుంచి అనువదించే అవకాశం కలిగించినందుకు సిద్ధర్ గారికి సదా కృతజ్ఞుడని.

భాషాసేవకుడు

**తిరుమల రామచంద్ర**

1-4-880/19,
బరోడా బ్యాంక్ కాలనీ,
న్యూబాకారం,
హైద్రాబాద్ - 50 380.



శ్రీ రంగనాథస్వామి మూల విరాట్టు

# శ్రీరంగం దేవాలయ నిర్మాణం

## సిద్ధుల పద్ధతిలో తత్త్వ వివరణ

కావేరీ నది జన్మస్థానం కొడగుకొండలు. ఈ నది ముక్కొంబి అనేచోట రెండు పాయలుగా చీలుతున్నది. పిదప కల్లణై వద్ద మరల ఒకటిగా చేరుతున్నది. కల్లణై నుంచి మరల ఐదుపాయలుగా చీలి, పెక్కు పేర్లతో ప్రవహిస్తున్నది. తూర్పు పడమరలుగా పది మైళ్ళ వైశాల్యంలో ఏర్పడిన ఈ ద్వీపంలో శ్రీరంగ క్షేత్రం నెలకొని ఉన్నది.

తత్త్వ వివరణ : కొడగుకొండలు బ్రహ్మ స్థితిని సూచిస్తున్నవి. బ్రహ్మస్థితి ఒక్కటే. ముక్కొంబి అనేచోట మూడు పాయలుగా చీలడం ఇడ, పింగళ, సుషుమ్నా నాడులను సూచిస్తున్నది. మధ్యన ఏర్పడిన ద్వీపం భ్రూమధ్యం. కల్లణై నుంచి ఐదు పాయలుగా చీలడం ఐదు జ్ఞానేంద్రియాలకు సూచన. ఇవి మనను క్రిందివైపు తీసుకొని వెళ్ళుతాయి గనుక మనం నదీ ప్రవాహం వెంబడి క్రిందివైపు వెళ్ళక ఎదురీది పైచూపుతో మీదికి వెళ్ళి బ్రహ్మమును కలుసుకొనే పద్ధతిని శ్రీరంగ దేవాలయ నిర్మాణం వివరిస్తున్నది.

అమ్మా మంటప నిర్మాణం : అమ్మా మంటపం నుంచి శ్రీరంగం దేవాలయానికి బయలుదేరితే మొదట మనము చేరేది పులిమంటపం. ఇది పదహారు స్తంభాలున్న మంటపం. ఇది పదహారు కళలున్న చంద్ర కళను సూచిస్తున్నది. తర్వాత రాయగోపురం వరకు నాలుగు స్తంభాలున్న మంటపాలు మూడు ఉన్నవి. ఈ మండపాల మొత్తం పన్నెండు స్తంభాలు సూర్యకళను సూచిస్తున్నవి. రాయగోపురం సమీపంలో మరొక పదహారు స్తంభాల మంటపం ఉన్నది. ఇది చంద్రకళను సూచిస్తున్నది.

గోపురాలు నాలుగు. రాయగోపురం, నాలుగు ముఖాల గోపురం, కట్టై గోపురం, శ్రీరంగ గోపురం అని మొత్తం నాలుగు గోపురాలు.

గోపురాల వివరణ : 1. రాయగోపురం : రాయ గోపురం సగం నిర్మాణంలోనే ఆగిపోంది. దీనిని అహోబల మఠం 44వ జీయర్ స్వామి 13 అంతస్తులు నిర్మించి పూర్తిచేశారు. దీని ఎత్తు 236 ఆడుగులు. ఆసియాఖండ గోపురాలలోనే ఇది పెద్దది. ఈ రాయ గోపురాన్ని దాటగానే నాలుగు స్తంభాలున్న ఒక మంటపం ఉన్నది.

2. కూరగాయలంగళ్ల గోపురం : ఈ గోపురం దాటగానే చిత్ర వీథిని ఆనుకొని ఉన్న నాలుగు స్తంభాల మంటపంలో పాతాళ కృష్ణులు ఉన్నారు. ఈ స్వామి భూమి మట్టానికి క్రిందగా ఉన్నారు. కుండలిని శక్తిని క్రింది నుంచి మీదికి తీసుకొని పోవాలి అనే విషయాన్ని యిది సూచిస్తున్నది. ఈ రెండు మంటపాలకు మొత్తం ఎనిమిది స్తంభాలున్నవి. ఇది మన శ్వాస ఎనిమిది అంగుళాలమేర మన దేహంలో చేరడాన్ని సూచిస్తున్నది.

3 కట్టై గోపురం :

4. నాలుగు ముఖాల గోపుర ద్వారం : రాయ గోపురం నుంచి నాలుగు ముఖాల గోపుర ప్రవేశ ద్వారం వరకు నాలుగు గోపురాలున్నవి. ఇవి వెలుపలికి అధికంగా వెడలే నాలుగంగుళాల శ్వాసను యోగాభ్యాసంతో మనం దేహంలోనే నిలుపవలెననడాన్ని సూచిస్తున్నవి. ఈ దేవాలయంలో మూల విరాట్టును చేరడానికి రాయగోపురం నుంచి నాళిగై కేట్టాన్ ద్వారం వరకు ఏడు గోపురాలున్నవి. ఇవి ఆరు దశలను, వాటిని దాటిన తర్వాత ఏడవ దశలో పరమాత్మ ఉన్నాడు అనడాన్ని సూచిస్తున్నవి.

కోవెలలో ప్రవేశించగానే కుడివైపు కూరత్తాళ్వార్ సన్నిధి ఉన్నది. కూరత్తాళ్వార్ మహా యోగి. ఇంద్రియాలను గెలిచినవాడు. యోగులకు ఇంద్రియ నిగ్రహం, వైరాగ్యం యెంతో ముఖ్య మనడాన్ని యిది సూచిస్తున్నది.

నాథముని సన్నిధికి ఎదురే విప్రనారాయణుల లేక తొండరడిప్పొడి యాళ్వార్ల సన్నిధి ఉన్నది. ఈయనవంటి యోగులు భగవంతునికి ఎంతటి ప్రియ భక్తులో కాగలరు అనడాన్ని ఈ సన్నిది తెలుపుతున్నది.

మొదటి ఆధారం మూలాధారం. కోవెలలో ప్రవేశించగానే ఉన్నది నాథముని సన్నిధి. దీని తత్త్వమేమనగా నాదాన్ని పొందాలి అనేదే.

శ్రీరంగ విలాస మంటపం పైన ఉన్న శిల్పాల వివరణమిది:

1. లక్ష్మీనారాయణులు: వైష్ణవ మతంలో అత్యంత శ్రేష్ఠమైన మంత్రం ద్వయమంత్రం. ఇది రెండు ఖండాలు గలది. "శ్రీమన్నారాయణ చరణౌ శరణం ప్రపద్యే, శ్రీమతే నారాయణాయ నమః" అనేవి రెండు ఖండాలు. లక్ష్మీనారాయణ శిల్పం ఈ మంత్ర రహస్యాన్ని వివరిస్తున్నది. లక్ష్మీదేవి కటాక్షంతోనే భగవంతుని పాదపద్మాలను చేరడం సాధ్యమనేది దీని ఆంతర్యం.

2. చక్రత్తాళ్వార్: అజ్ఞానాంధకారాన్ని పోగొట్టుకొని, జ్ఞాన సంపాదన మార్గాన్ని పొందడానికి పూజించదగిన శ్రీసుదర్శన మహామూర్తి స్వరూపమిది.

చక్రం భగవంతుని హృదయానికి ప్రతీక. ఇది చక్రం వలె తిరుగుతూ సజ్జనులను రక్షించి సన్మార్గంలో జీవింపజేస్తుంది.

3. ఆదిశేషునిపై పరుండి వున్న భగవంతుని విగ్రహం. పాల కడలిలో తేలాడుతున్న మహా మహిమాత్ముడైన ఆదిశేషుడు ఐదు పడగల వాడు. అతని మీద పవ్వళించి ఉన్నాడు పరమాత్మ. క్రింద పాలకడలి. ఇది పాలవంటి స్వచ్ఛ ధవళ మధురమైన గుణాలను తెలుపుతున్నది. లేక స్వచ్ఛతను తెలుపుతున్నది. మానవుడు అనుభవించే ఐహిక సుఖాలు శబ్ద స్పర్శ రూప రస గంధాలు ఐదింటిని జయించినట్లయితే, సద్గుణ సాగరుడై విరాజిల్లుతాడని దీని తాత్పర్యం.

4. పరమపదనాథుడు: ఆదిశేషుని మీద ఒక కాలు ఉంచి, రెండవ కాలును క్రింద వ్రేలాడవేసి ఆసీనుడైన భగవన్మూర్తి. ఇది అష్టా

క్షరదైవం బదరికాశ్రమంలో నర నారాయణులనే రెండు రూపాలతో వేంచేసినారు స్వామి. ఈ రెండు రూపాలలో ఒకటి గురువు అవతారం, రెండవది శిష్యుని అవతారం. నరునికి నారాయణుడు అష్టాక్షరి మంత్రాన్ని ఉపదేశించినట్లు పెద్దలు చెబుతారు.

ఓమ్ నమో నారాయణాయ అనేది అష్టాక్షరి మంత్రం. ఈ పరమ పదనాథుడు ఆసీనుడైన విధానం అంతర్యమేమనగా, సూర్యకల అనే కుడి కాలును ముడుచుకొని, ఎడమ కాలును క్రిందికి వ్రేలాడవేసుకొనడం.

యోగ సమాప్తి దశలో చంద్ర కళలో ఉండ వచ్చును. అప్పుడు ఎడమకాలును కుంచించుకొని, కుడి కాలును వ్రేలాడ వేసుకోవాలి.

కనుక పరమపదనాథుడు ఇక్కడ సూర్యకళలో ఉన్నాడని అంతర్యం

5. శ్రీ రాముడు విభీషణుని సముద్రంలో ఆత్మీయుని చేసుకొనే దృశ్యం : ఇది రామాయణపు చివరి సందేశం. ఏ కాలంలోనైనా, ఏ దేశంలోనైనా పంచభూతాల నుంచి కాపాడుతాను అని శ్రీ రాముడు విభీషణునికి అభయ మిచ్చినాడు.

సముద్రం — జనన మరణ సముద్రం.

విభీషణుడు — ధర్మమార్గంలో స్థిరంగా ఉండి, ధర్మమార్గంలో నడచిన జీవుడు.

శ్రీరాముడు — సకల యోగులచేత భక్తితో ధ్యానింపబడే పరమాత్మ.

ధర్మమార్గంలో నడిచే వానిని యోగులు ఆదరంతో హృదయ కమలంలో అధిష్ఠింపజేసుకుని నమస్కరిస్తారు. ఇట్టి మార్గంలో నడిచేవారిని పరమాత్మ జనన మరణ సముద్రం నుంచి ఉద్ధరించి, తనవారినిగా చేసుకొని సకల భూతాల నుంచి ఎట్టి విపత్తు లేక కాపాడి అనుగ్రహిస్తారని ఈ దృశ్యం భావం.

6. వరాహ మూర్తి ఒడిలో భూదేవి : ఇది భూదేవికి వరాహావతారంలో ఉన్న విష్ణువు భక్తి మార్గాన్ని ఉపదేశిస్తున్న దృశ్యం. వరాహ

మూర్తి చేసిన ఉపదేశాన్ని వరాహ చరమ శ్లోకమని పెద్దలు అంటారు. పాతాళంలో కూరుకు పోయిన భూమిని భగవంతుడు వరాహావతారమెత్తి తన రెండు కోరలతో పైకిఎత్తి, ఆమెకు జ్ఞానోపదేశం చేసినాడు. ప్రాణం ఈ దేహాన్ని వదలిపోతున్నప్పుడు కఫ వాత పిత్తాలతో ఏర్పడే బాధతో మానవుడు భగవంతుని స్మరించజాలడు.

దుఃఖసాగర నిమగ్నమైన జీవాత్మను భగవంతుడు ఏదో ఒక అవతారమెత్తి తనకే చెందిన రెండు గుణాలయిన ప్రేమ కారుణ్యాలతో చేయూత ఇచ్చి గట్టెక్కించి "శరీర మనస్సులు స్వస్థంగా ఉన్నప్పుడు నన్ను ధ్యానించు నీవు ప్రాణాలు వదిలేటప్పుడు నిన్ను స్మరించి, నిన్నే కాపాడి అనుగ్రహిస్తాను." అనడం దీని రహస్యం.

7. పార్థ సారథి: ఇది అర్జునునికి కృష్ణుడు భగవద్గీత ఉపదేశించే దృశ్య శిల్పం. దీనిని గీతాచరమ శ్లోకమని పెద్దలు అంటారు. "భవబంధాలన్నిటిని తొలగించుకొని నా పాదపద్మ సన్నిధిని చేరగలవు. అన్నిటి నుండి విముక్తిని నేను ప్రసాదిస్తున్నాను." అని పార్థసారథి అభయం.

తేరు (రథం) దేహం: మనస్సు కళ్ళేలు. గుర్రాలు పంచ భూతాలు, ఆత్మ రథారూఢుడు.

కృష్ణుడు శ్రేష్ఠమైన జ్ఞాన నేత్రం, కృపాదృష్టిగల ఆచార్యుడు.

రథసారథి మహా జాగరూకుడై కళ్ళేలను బిగబట్టి గుర్రాలను అదుపులో పెట్టుకొని సావధానంగా నడిపించకపోతే, రథారూఢుడు దారి తప్పి చెడుతోవ పట్టి నశిస్తాడు. ఆ విధంగానే, సంపూర్ణ జ్ఞానస్వరూపుడు, సర్వ శక్తుడు, సర్వజ్ఞుడు అయిన భగవంతుని కరుణా పూర్ణహృదయమును గ్రహించక, పంచేంద్రియాలను అదుపులో పెట్టుకొనక పంచభూతాలను అణచనిపక్షంలో దేహాధిష్ఠితుడైన జీవాత్మ దుష్టమార్గాలు తొక్కి నశిస్తుందని దీని భావం.

తత్త్వం మూడు విధాలు :

అచేతనం — ప్రాణంలేని వస్తువు.
చేతనం — ప్రాణమున్న వస్తువు.
ఈశ్వరుడు — పరమాత్మ.

వైష్ణవ సంప్రదాయం ప్రకారం శ్రేష్ఠమైన ఐదు ఈశ్వర అవతారాలు ఈ విధంగా ఉన్నాయి.

1. పరావతారం — పరమ పదనాథుడు.
2. వ్యూహావతారం — అనంతునిపై శయనించిన అనంతశాయి.
3. విభవావతారం — రామకృష్ణ వరాహాద్యవతారాలు.
4. అంతర్యామి — ప్రతిజీవి హృదయాన్ని అధిష్ఠించిన భగవంతుడు.
5. అర్చావతారం— దేవాలయాలాదులలో ప్రతిష్ఠించిన భగవన్మూర్తి.

ప్రతిజీవి అంతరంగాన్ని అధిష్ఠించినవాడు అంర్యామి. ఇతడు కంటికి కానరాడు. కోవెలలలో ఆరాధితుడయ్యే భగవంతుడు అర్చావతారమూర్తి. ఈ విధంగా అయిదు అవతారాలలో శ్రీ మహావిష్ణువు వేంచేసి ఉన్నాడు. ఈ విధంగావైష్ణవ సంప్రదాయ సిద్ధాంతం స్పష్టపరుస్తున్నది.

తర్వాత ఉన్నది ఆండాళ్—గోదా—సన్నిధి. భగవత్ప్రాప్త్యుపాయం చూపి తోడ్పదే వ్యక్తి ఈమే. శక్తి మానవునికి తోడుగా నిలబడాలనేది దీని భావం.

అటు పిదప ఉన్నది అపూర్వ శిల్ప కలా మంటపం. దీనికి శ్రీరంగ విలాస మంటపమని పేరు. దీనిలో భౌతికాధ్యాత్మికానందం కలిగించే సుందర శిల్పాలున్నాయి. రెండు విధాలైన ఆనందానుభూతులను కలిగించే ఆండాళ్ కుండలినీ శక్తికి సంకేతం. ఈ శిల్పాలు కుండలినిని పైకి అధిరోహింపజేస్తే కలిగే అనుభవాలను తెలుపుతున్నవి.

ఆండాళ్ సన్నిధికి సమీపంలో వేణుగోపాలుడు విశ్వరూపంలో ఉన్నారు. ఇక్కడ పెక్కు అపూర్వ శిల్పాలు ఉన్నవి. వివిధ జీవులు ఉన్నారనడానికి ఇది సంకేతం.

ఆండాళ్ సన్నిధికి సమీపంలో వాహన మంటపం ఉన్నది. ఉత్సవ సమయాలలో శ్రీ రంగనాథస్వామి ఉత్సవమూర్తి వివిధ వాహనారూఢుడై ఈ వాహన మంటపం నుంచే పురవీధులకు వేంచేస్తారు. పిదప ఇక్కడే వాహనాల నుంచి దిగి, తమ స్థానానికి వేంచేస్తారు.

వాహన మంటపానికి ఎదుటే ఒక ఆంజనేయుల గుడి ఉన్నది. ఈ ఆంజనేయ విగ్రహం చాల పెద్దది. ఈ మూర్తిని వీరాంజనేయులని వ్యవహరిస్తారు. ఇతని అనుగ్రహం పొంది యోగులు వీరులు అవుతారనేది దీని భావం.

ఇక్కడ యోగివాహులు (తిరుప్పాణాళ్వారు) అనే భక్తుని విగ్రహం ఉన్నది. ఈయన పన్నిద్దరాళ్వార్లలో ఒకరు. ఇతడు హరిజనుడైనా భగవంతుడు ఇతనిని తన భక్తశ్రేష్ఠునిగా సమ్మానించినాడు భగవంతుని కృపను పొందినవాడు నిజమైన భక్తుడుగా కీర్తింపబడుతాడు. వానికి జాతి మత విభేదం లేదు అనడాన్ని ఇది సూచిస్తున్నది. యోగులు కూడ అలాటి భక్తుని కొనియాడుతారు.

రంగ విలాగు మంటపం దాటి లోపల ప్రవేశిస్తే, కార్తికగోపురం తగులుకుంది. దాని ముందున్న భాగంలో ఉన్న గుండ్రటి స్థలంలో కార్తీకదీపోత్సవంనాడు దీపం వెలిగిస్తారు. దానికి ముందుగా నిలుచున్న యోగాంజనేయ సన్నిధి ఉన్నది. గోపురం మీద వినాయక విగ్రహం ఉన్నది. యోగి యోగాగ్నితో ముందుకు పోవడాన్ని ఇది సూచిస్తున్నది.

కార్తికగోపురానికి, చక్రత్తాళ్వార్ కోవెలకు మధ్యన ఉన్నది అమృత కలశం. ఇక్కడ మంటలు కాల్చడం యోగాగ్నిని తెలియజేస్తుంది. చక్రత్తాళ్వార్ యోగాన్ని ఆచరించి చూపినారు. యోగం నుంచి యోగాగ్నిని సహస్రారానికి (బ్రహ్మ రంధ్రానికి) కొనిపోయి, అక్కడే మనస్సును నిశ్చ ంగా ఉంచితే, అమృతం లభిస్తుంది. గరుడాళ్వార్ అమృతకలశాన్ని తన వద్ద ఉంచుకొనడం దీనిని సూచిస్తున్నది.

చక్రత్తాళ్వార్ సన్నిధి: కార్తిక గోపురానికి ముందు ఎమడవైపు చక్రత్తాళ్వార్ సన్నిధి ఉన్నది. అతడు సహస్రదళ పద్మం మీద కుడి

పాదాన్ని ముందుంచి యోగస్థితిలో నిలుచున్నారు కుడిపాదం సూర్య కలను సూచిస్తున్నది. చక్రత్తాళ్వార్ చుట్టూ ఉన్న జ్వాలా మండలం యోగాగ్నిని సూచిస్తున్నది. చక్రత్తాళ్వార్ పదహారు చేతులలో ఆయుధాలు ధరించి ఉన్నారు.

చక్రత్తాళ్వార్ వెనుక భాగంలో చతుర్బాహువైన యోగనర సింహులు ఉన్నారు. ఈ యోగనరసింహుల నాలుగు చేతులలోను నాలుగు చక్రాలు ఉన్నవి. మనస్సు నాలుగు విధాలుగా తిరుగుతుంది అనడాన్ని ఇది సూచిస్తున్నది.

యోగనరసింహులు, చక్రత్తాళ్వార్లు ఒకే శిలలో గండరించిన యంత్రం. చక్రత్తాళ్వార్ ఒకప్పుడు మహోగ్ర స్వరూపంలో ఉండేవారట. మునుపటి పెద్దలు చక్రత్తాళ్వార్ కోవెలకు ఎదురుగా ఉడయవర్ల (రామానుజుల) సన్నిధిని, దాని సమీపంలో పార్థసారథిని నిర్మించి చక్రత్తాళ్వార్ ఉగ్ర స్వభావాన్ని తగ్గించారని పెద్దలు చెబుతారు.

వసంత మంటపం : చక్రత్తాళ్వార్ సన్నిధికి అనుకొని ఉత్తరంగా ఉన్న పుష్పవనంలో వసంత మంటపం ఉన్నది. ఇక్కడ మన పురుషోత్తముడైన శ్రీరంగనాధుడు వైశాఖమాసంలో వేంచేయడం భగవంతుడు ప్రాపంచిక సుఖాలను ఆస్వాదించడానికి సూచన.

కార్తికగోపురానికి ఎదుట గొప్ప ప్రదర్శనశాల ఉన్నది. దీనిలో దంతశిల్ప విగ్రహాలు, పెక్కు అపూర్వ వస్తువులు ఉన్నవి.

ఉడయవర్ల సన్నిధి : కార్తిక గోపురానికి ముందు కుడి ప్రక్కన ఉడయవర్ల (రామానుజుల) సన్నిధి ఉన్నది. రామానుజుల దివ్యవిగ్రహాలు దేశంలో మొత్తం మూడు ఉన్నవని పెద్దలు అంటారు.

1. శ్రీరంగంలో ఉన్నది. తానే స్వయంగా వ్యక్తమైన మూర్తి— సహస్రారం నుంచి అమృతాన్ని వర్షించడం సూచిస్తున్నది.

2. తిరునారాయణపురంలో (కర్నాటకరాష్ట్రంలోని మేల్కోటెలో) ఉన్న మూర్తి. ఇది ఉడయవర్లకు ప్రీతిపాత్రమైన పవిత్రమూర్తి— లలాట నేత్రాన్ని సూచిస్తుంది.

3. శ్రీ పెరుంబూదూర్‌లో ఉన్నది, తన భక్తులకు, శిష్యులకు ప్రీతి పాత్రమైన మూర్తి-మూలాధారాన్ని సూచిస్తుంది.

ఉడయవర్ల పాంచభౌతిక శరీరం ఈ సన్నిధిలో సమాధి చేయబడినట్లు పెద్దలు చెబుతారు. ఈ సమాధిపై పుట్ట పెరిగింది. ఆ పుట్ట మన్నుతో ఇప్పటి ఈ విగ్రహం నిర్మితమైంది - స్వయంవ్యక్తమైంది - గనుక అభిషేకంగాని, తైల స్పర్శగాని ఉండవు. అయినా, ఈ విగ్రహం వ్రేళ్లు, గోళ్లు, శిరోజాలు మొదలయినవి మన కళ్లకు ప్రకృతి సహజమైన మానవ శరీరంలో ఉన్నట్టే దర్శనమిస్తున్నవి.

ఉడయవర్ సన్నిధికి తర్వాతిది పార్థసారథి సన్నిధి. చక్రత్తాళ్వార్ సన్నిధికి ఎదుట ఉన్న ఈ పార్థసారథిస్వామి సన్నిధి మంటపం మీద ముందు భాగంలో పెద్ద పాంచజన్య శంఖ విగ్రహం ఉన్నది.

కుడివైపున పార్థ సారథి సన్నిధి ఉన్నది. స్వధర్మం నుంచి విచలితుడు కావద్దని, యుద్ధం కొనసాగించుమని అర్జునునికి పార్థసారథి ఉపదేశించి ప్రోత్సహించినాడు. ఈ భారత మహాసంగ్రామ సూచకంగానే కార్తిక గోపురం ముందు పెద్ద మంటలు వేయడం. ఈ కార్తికోత్సవపు మంటలు యోగాగ్నికినీ సంకేతం. మానవుడు యోగాగ్నితో పాపాలను కాల్చివేస్తే శంఖంవలె పరిశుద్ధుడవుతాడు అనడాన్ని ఈ పెద్ద పాంచజన్యం సూచిస్తున్నది. ఈ సన్నిధికి పక్కనఉన్న మంటపంలో (వేయి స్తంభాల మంటపం ఎచుట) యుద్ధ దృశ్యాలున్న శిల్పాలు, ఐహికాముష్మిక సుఖ సూచకమైన శిల్పాలు, చాల సుందరమైనవి ఉన్నవి.

కార్తిక గోపురానికి ఇరుప్రక్కలా గంగా కావేరీ విగ్రహాలు ద్వార పాలికలుగా చెక్కబడి ఉన్నవి. ఈ శిల్పాలు భక్తులు కావేరీ గంగా నదులనే కరుణా ప్రవాహంలో మునిగి దేవాలయంలో ప్రవేశించాలనడాన్ని సూచిస్తున్నవి.

పార్థసారథి సన్నిధి సమీపంలోనే పిళ్ళై లోకాచార్యుల ఆలయం ఉన్నది. ఈయన ఆత్మ పరమాత్మల సంబంధాన్ని, భగవంతుని పొందే మార్గాన్ని, తత్ప్రాప్తి ఫలాన్ని వివరించే "అష్టాదశ రహస్యం" అనే గ్రంథాన్ని రచించినవారు. యోగానికి ఆత్మ పరమాత్మ స్వరూపం నిర్ణాయకం అనడాన్ని కూడ పిళ్ళైలోకాచార్యులు తమ గ్రంథంలో వివరించినారు. ఈ సన్నిధి ఎదుట నాలుగుస్తంభాల మంటపం ఒకటి ఉన్నది. ఇక్కడికి సంక్రాంతినాడు, వసంతోత్సవంనాడు శ్రీరంగనాథులు వేంచేస్తారు. (సంక్రాంతి, కనుమ పండుగ ఉత్సవాలలో ఈ నాలుగు స్తంభాల మంటపం దాటి తిరుమామణి మంటపం చేరాలి. ఆత్మ యోగంతో పరమాత్మను సాక్షాత్కరించుకొని ధర్మార్థ కామ మోక్షాలనే చతుర్విధ పురుషార్థాలలో మొదటి మూడింటిని దాటి నాల్గవదైన మోక్ష స్థితిని పొంది తిరుమామణి మంటపం ప్రవేశించి భగవంతుని పొందుతారు అనేది దీని ఆంతర్యం.)

## స్వాధిష్ఠానం

రెండవ ఆధారం : స్వాధిష్ఠానం, గరుడమంటపం. గరుడాళ్వార్ యోగసమాధిలో కుడికాలు పైకి ఎత్తి సూర్యకళలో ఉన్నారు. తల నుంచి పాదం వరకు శరీరమంతా పాములు చుట్టుకొని ఉన్నవి. ఇది ప్రాణశక్తి వేగాలను సూచిస్తుంది.

సూర్య పుష్కరిణి : ఈ పుష్కరిణి గరుడాళ్వార్ సన్నిధి సమీపంలో తూర్పున ఉన్నది. గరుడ మంటపం ఉత్తర భాగాన ఉత్తర ముఖంగా మెట్లు దిగేచోట రెండు పక్కలా రామాయణ దృశ్యాలు గండరించబడి ఉన్నవి. ఇవి 96 తత్త్వాల సంఘర్షణను సూచిస్తున్నవి.

సూర్య పుష్కరణి దగ్గర, గరుడాళ్వార్ సన్నిధికి వెనుక తూర్పున కాంచీపూర్ణుల సన్నిధి ఉన్నది. ఈయన కాంచీ వాస్తవ్యులు. కాంచీ వరదరాజస్వామిని ప్రత్యక్షంగా దర్శించి సంభాషించినట్లు

ఐతిహ్యం. ఈయన రామానుజులకు ఆచార్యులని ప్రతీతి. ఆ కాలంలో ఋషులు, మునులు భగవంతుని ప్రత్యక్షంగా దర్శించడం, సంభాషించడం జరిపేవారని దీనినుంచి మనకు తెలియ వస్తున్నది.

నమ్మళ్వార్ సన్నిధి : గరుడమండపానికి సమీపంలో తూర్పున వరాంకుశముని సన్నిధి ఉన్నది. ఈయనకు శఠగోపముని అని, తమిళ భాషలో నమ్మాళ్వారని పేర్లు. నమ్మాళ్వార్ వేదాన్ని తమిళీకరించిన మహితాత్ములు. ఈ కోవెలలోనే నమ్మళ్వారుతోపాటు మధురకవి ఆళ్వారు, పరకాలులు (తిరుమంగై ఆళ్వారు) వేంచేసి ఉన్నారు. యోగుల నియమాలను, సిద్ధులను వివరించే కోవెలలు ఉన్నవి. నమ్మాళ్వారు భగవంతుని ఉల్లమందే ధ్యానించినారు. మధురకవి గొప్పయోగి. యోగంతో ఉత్తమాచార్యుణ్ని పొంది భగవంతుని సాక్షాత్కరించుకొన్న ఆచార్యుని కృపతో భగవత్సాక్షాత్కారం పొందవచ్చునని దీని భావం.

నమ్మాళ్వార్ తిరునక్షత్రం (జన్మదినోత్సవం) వైశాఖమాసంలో విశాఖ నక్షత్రంనాడు జరుపబడుతుంది. ఇది వేసవి కావడంవల్ల వేసవి వేడి తగ్గి చల్లబడడానికి పాలలో పచ్చికొబ్బెర, మూడువంతులువండిన మామిడి, పనస, అరటి ముక్కలు, తేనె, ఏలక్కాయలు, కుంకుమపూవు, నేయి, బెల్లం, మిరియాలు, జిలకర చేర్చి నీళ్లు ఇగిరి పోయేటట్టు ఉడికించి ప్రసాదంగా వినియోగం చేస్తారు. ఈ ప్రసాదం నమ్మాళ్వార్ తిరునక్షత్రంనాడు నమ్మాళ్వార్ సన్నిధిలోను, రంగనాథస్వామి కోవెలలోను మాత్రమే వినియోగంచేస్తారు.

గరుడాళ్వార్ సన్నిధి :- ఇది గరుడ మంటపంలో. గరుడాళ్వార్ దయాదృష్టితో 96 తత్త్వాలు అణగిపోతాయని పెద్దలంటారు. ఈ సన్నిధికి ఎడమవైపున ధాన్యాగారం, గోశాల ఉన్నవి. కుడివక్కన అన్నమయ కోశం ఉన్నది. ధాన్యాగారంకోపల సెంగమలనాచ్చియార్ సన్నిధి,

ఆమె దివ్యసుందర విగ్రహం ఉన్నవి. ఇవి ధాన్యలక్ష్మిస్థితిని సూచిస్తున్నవి.

బయలు : తర్వాతి గోపురానికి వెళ్లడానికి ముందున్న బయలులో ఒక పాయ తాయార్ (రంగనాయకి) సన్నిధికి వెళ్లుతుంది. రంగనాథాలయాన్ని ప్రదక్షిణం చేయడానికి కూడ ఈ బయలు ఉపయోగిస్తుంది. ఇది దేహనిర్మాణంలో యోగానుభవంవల్ల కలిగే శూన్యస్థితిని సూచిస్తుంది,

## మ ణి పూ ర కం

మూడవ ఆధారం మణిపూరకం : ఇదే ఆర్యభట్ట ద్వారగోపురం. దీని ముందున్న ఇత్తడి మెట్ల ముందుభాగంలో పన్నెండు రాశులు, వెనుక భాగంలో ఇరవైయేడు నక్షత్రాలు గండరించబడి ఉన్నాయి. దీని భావమేమనగా, దినరాశి గ్రహాదుల చిక్కులను తొలగించుకొని లోపల యోగస్థితిలో ప్రగతి సాధించి ముందుకు వెళ్లాలి అనడం.

ఆంజనేయులు : ఆర్యభట్ట ద్వారం ప్రవేశించగానే, కుడివైపున తూర్పుభాగాన ఎత్తయిన వేదిక మీద యోగసమాధిలో ఆంజనేయులు ఉన్నారు. ఆ విగ్రహాన్ని తలయెత్తి చూడవలసి ఉంటుంది. మన దృష్టిని ఎప్పుడూ ఊర్ధ్వంగానే ఉంచుకోవాలని దీని భావం. ఈ సన్నిధి పక్కన రెండు నేతితొట్లు ఉన్నవి. ఈ తొట్లలో పూర్వకాలంలో నేయి నిండుగా ఉండేది. భక్తులు సమర్పించే నేతిని ఈ తొట్లలో నింపేవారు. పిదప కైంకర్యానికి వాడేవారు. ఇప్పటికిని శ్రీరంగంలో స్వామి దీపాలు మొదలు ప్రసాదం వరకు అన్నిటికిని నేయితప్ప మరొకటి వాడరు. స్వామి ఉత్సవాలలో దివిటీలకు కూడ నేతినే వాడుతారు. తక్కిన నూనె దీపాలు ఉపయోగించరు. యోగాగ్ని మనను దహించకుండా నేతినే ఉపయోగించాలని ఈ నేతితొట్లు సూచిస్తున్నవి.

ధ్వజస్తంభానికి ఎదుట దక్షిణభాగాన డోలోత్సవ (ఊయల ఉత్సవ) మంటపం ఉన్నది. మనశ్చాంచల్యాన్ని అణచివేసిన పిదపనే దేవాలయం లోపల ప్రవేశించడం సాధ్యమనడాన్ని ఇది సూచిస్తున్నది.

ఇక్కడ పవిత్రి మంటపం అనే ఒక మంటపం ఉన్నది. శ్రావణ మాసంలో శ్రీరంగనాథుడు ఈ మంటపానికి వేంచేసి పవిత్రం (యజ్ఞోప వీతం) ధరిస్తారు. వీర్యాన్ని అణచివేస్తే యోగి పునీతు డవుతాడని ఇది సూచిస్తున్నది.

ఈ తిరుపవిత్రోత్సవ మంటపానికి పశ్చిమభాగంలో హయగ్రీవ సరస్వతి దేవుల ఆలయాలు ఉన్నవి. భగవంతుడు బ్రహ్మదేవుని నుంచి వేదాలు అపహరించుకొని పోయిన మధుకైటభులనే దానవులను వధించి వేదాలను ఉద్ధరించి హయముఖంతో బ్రహ్మదేవునికి జ్ఞానోపదేశం చేసి నాడు. ఈ స్థలానికి రాగానే సకలశాస్త్రాలు, కళలు మనకు లభిస్తున్నవి.

పక్కనే పాకశాల ఉన్నది. జఠరాగ్ని ని-ఆకలిని శమింపజేయ డానికి ఆవశ్యకమైన సాత్త్వికాహారాన్ని ఇది సూచిస్తున్నది. ఎడమ వైపున దక్షిణోత్తరంగా ఉన్న మంటపం వాయువు పరుగును తెలుపు తున్నది. ఈ మంటపంలో ఐహికాముష్మిక శిల్పాలు, కృష్ణుని దివ్యలీలల శిల్పాలు ఉన్నవి. ఒక శిల్పంలో బిందుదండమైన పురుషాంగాన్ని సగం పక్కకు వంచి పైకి తీసుకొని పోయేటట్టు ఉన్న దృశ్యం, మరొక శిల్పంలో పురుషాంగాన్ని నిలువుగా పైకితీసుకొని పోయేటట్టున్న దృశ్యం ఉన్నవి. మానవుడు బిందువును-వీర్యబిందువును నిగ్రహించి స్తంభింప జేస్తే, అది పాలభాగంలో భ్రూమధ్యంలో మణిగా రూపొందుతుంది. ఇదే రసమణి, కాయకల్పం, కామధేనువు, కల్పవృక్షం అని ఈ శిల్పాల భావం

ఇక్కడప్రసవ దృశ్య శిల్పమొకటి ఉన్నది. కామవాంఛ, ప్రాపంచిక వ్యవహారాలు మొదలయినవాటిలో చిక్కుకొని, యోగాభ్యాసం చేయకపోతే మరొక జన్మ ఉన్నది అనడాన్ని ఈ ప్రసవదృశ్యం తెలుపుతున్నది. ఆధ్యాత్మికానంద దృశ్యాలు మనం యోగస్థితిలో ముందుకు సాగితే

అవతార పురుషులు కావచ్చుననడాన్ని తెలుపుతున్నవి. ఈ స్థితిని దాటి ముందుకు వెళ్లితే స్వర్గం పొందవచ్చు.

ముందు భాగంలో ధ్వజస్తంభం, బలిపీఠం ఉన్నవి. భ్రూమధ్య భాగాన్ని - సుషుమ్నా నాడిని పైకి అధిరోహింప జేయడానికి ధ్వజస్తంభం సూచన. మూడు మలాలను బలి యివ్వాలనడానికి బలిపీఠం సూచన.

సోపానాలు : దేవాలయంలో ప్రవేశించడానికి ఎక్కే మెట్లలో మొదటి మూడు చాల ఎత్తైనవి. నాలుగవ మెట్టు రెండు నిలువు వ్రేళ్లంత ఎత్తైనది. ఐదవ ఆరవ మెట్లు ఒక నిలువు వ్రేలంత ఎత్తైనవి. ఇది ఆరు ఆధారాలను సూచిస్తున్నది. వీటిని ఎక్కి దాటి వెళ్లాలి. ఇక్కడ మొదటి మూడు మెట్లే ఎక్కడం కొంచెం కష్టం. మొదటి మూడు ఆధారాలు దాటడం కష్టమని దీని సూచన. ఈ మూడు మెట్లను దాటి యోగ స్థితిలో ముందుకు కొనసాగితే, తర్వాత వచ్చే మూడు దశలు సులంభంగా దాటి పోవచ్చు ననడాన్ని ఇది సూచిస్తున్నది.

ఈ భూమండలాన్ని వదలి మరొక మండలానికి వెళ్ళడానికి యంత్రాన్ని ఏవిధంగా ఉపయోగించి వెళ్లుతున్నారో ఆ విధంగానే యోగ స్థితిలోను మెట్టు మెట్టుగా ముందుకు పోతూ సమాధిస్థితిని పొందడానికి ప్రయత్నిస్తున్నప్పుడు ప్రపంచ వ్యవహారాలను వదలి వెళ్లాలని దీని సూచన.

## అ నా హ తం

నాల్గవ ఆధారం :- నాల్గవ ఆధారం అనాహతం. అదే నాళిగై కేట్టాన్ (గంటలు వినే) ద్వారం. ఈ ద్వారంలోపల శంఖనిధి, పద్మనిధి ద్వార పాలికలవలె స్త్రీ రూపంలో ఉన్నవి. ఇది సమస్త సంపదలను యోగంతో పొందవచ్చుననడానికి సూచన.

నాలుగు స్తంభాల మంటప మొకటి దక్షిణ ద్వారాన్ని ఆనుకొని ఉన్నది. పిదప నడమటి ప్రాకారంలో నాలుగు స్తంభాల రెండుమంటపాలు

విడివిడిగా ఉన్నవి. మనం పీల్చేగాలి - ప్రాణ వాయువు ఎనిమిది అంగుళాల ప్రమాణం గలది. వదిలే వాయువు పన్నెండంగుళాల పరిమాణం గలది. దీనితో వ్యర్థమైపోయే నాలుగంగుళాల వాయువును మరల పొందాలి అనడాన్ని ముందున్న నాలుగు స్తంభాల మంటపం వెనుక పశ్చిమ ప్రాకారంలో ఉన్న రెండు నాలుగు స్తంభాల మంటపాలు సూచిస్తున్నవి ఇవి మొత్తం మూడు మంటపాలు, పన్నెండుస్తంభాలు సూర్య కళను పూర్తి చేయాలని సూచిస్తున్నవి. వాటిని అనుసరించి ప్రాకార ప్రదక్షిణం చేసేటప్పుడు తూర్పుభాగాన చిలుక మంటపం (కిళిమంటపం) అర్జున మంటపాన్ని ఆనుకొని ఉన్నది. ఈ చిలుక మంటపంలో చిలుకలు ఎగిరిపోకుండ పంజరాలలో బంధింపబడి ఉన్నవి. చిలుకలలాగే ప్రాణ శక్తిని దేహంలో అణచిపెట్టి పై చూపుతో అధిరోహించడానికి బ్రహ్మ రంధ్రంలో చేర్చాలనడాన్ని పంజరాలు సూచిస్తున్నవి. మహమ్మదీయులు మసీదులలో పావురాలను పెంచడం ఈ భావంతోనే కావచ్చును.

శ్రీరంగం రాజుగున రంగరాజును ఉత్సవ దినాలలో సేవించక పోతే, మరుసటి సంవత్సరం ఆ ఉత్సవ దినాలలో నిర్దిష్టమైన దినంలోనే సేవించాలి. మధురరాజ్యపాలకుడైన విజయరంగ చొక్కనాథుడు కైశిక ఏకాదశినాడు జరిగే సోపానారోహణ సేవ కోసం వచ్చి, సేవించలేక ఒక సంవత్సరంపాటు వేచి వుండి సేవించుకొని వెళ్లడమే దీనికి ఉదాహరణ.

దేవాలయం చుట్టూవున్న ప్రాకారాలు :- రంగనాథ దేవాలయం చుట్టూ ఉన్న ప్రాకారం ఓరగా ఉన్న ఎత్తుగున మంటపాల క్రింద (చిలుక మంటపంలో భాగం) అడుగుల లోపల సొరంగ మార్గాలు ఉన్నవి. ఇవి అధోముఖానికి సంకేతం. పైన ఉన్న వెలుపలిదారి ఊర్ధ్వముఖానికి సంకేతం యోగంలో ఊర్ధ్వదృష్టితో ముందుకు వెళ్లాలనడానికి ఇవి సూచన. ప్రదక్షిణం చేస్తున్నప్పుడు, సేనైముదలియార్ (విష్వక్సేన) సన్నిధి అర్జున మంటపాన్ని ఆనుకొని ఉన్నది.

విష్వక్సేన మందిరం :- సేనై ముదలియార్ అంటే సేనాపతి, విష్వక్సేనుడు. ఈయన సేనలను నిర్వహించేవారు. ఈయన నమ్మాళ్వారుకు ఆచార్యులు, బ్రహ్మోత్సవ సమయాలలో అంకురార్పణానికి ముందు నగర శోధనోత్సవం జరుగుతుంది. ఆ ఉత్సవంలో విష్వక్సేనులు తిరువీధులలో వేంచేసి నగర శోధన చేస్తారని ఐతిహ్యం. విష్వక్సేన ఆలయంలో విభీషణ ఆంజనేయుల విగ్రహాలున్నవి. విభీషణులు ఆది బ్రహ్మోత్సవం నడిపినవారు. బ్రహ్మోత్సవానికి మృత్తికా సంగ్రహణం చేసే తిరుముళై ఉత్సవంలో విభీషణులకు, ఆంజనేయులకు భాగం ఉంది.

ఈ కోవెల చుట్టూ ఇద్దరిద్దరు జంటగా నృత్యం చేసే శిల్పాలున్నవి. ఇడా పింగళులలో ప్రాణ వాయువు సంచారానికి ఇవి సూచన, చివరి శిల్పం ఒకరే నృత్యం చేస్తున్నట్టు ఉంది. భ్రూమధ్యంలో ప్రాణ వాయువు ఒక్కటే అయి, ఏకముఖంగా ఊర్ధ్వముఖమై ప్రసరించడాన్ని ఇది సూచిస్తున్నది. నృత్యం ఇంతటితో సమాప్తమవుతున్నది. నాళిగై కేట్టాన్ (గంటలు వినే) ద్వారం గడవగానే ఐహిక భోగవాంఛలు మరుగవుతున్నవి. పారలౌకిక వాంఛానుభూతులే నిలుస్తాయి. ఇక్కడ సాధారణమైన నాలుగు స్తంభాల మంటప మొకటి ఉన్నది. దీనిలో డోలోత్సవం (ఊయెల) ఇనుప కొండ్లు ఉన్నవి. యోగులు ఎక్కడికైనా ఎగిరిపోయి రాగలరనడాన్ని ఈ శిల్పాలు సూచిస్తున్నవి

అర్జున మంటపం :- ఈ మంటపంలో అరవై నాలుగు స్తంభాలున్నవి. ఈ అరవైనాలుగు స్తంభాలలో ముప్పైరెండు ఒక భాగంగాను, రెండవ ముప్పైరెండు రెండవ భాగంగాను విడదీయబడినవి. మార్గశిర మాసంలో జరిగే అధ్యయనోత్సవంలో రంగనాథ ఉత్సవమూర్తి నంబెరుమాళ్ ఈ మంటపానికి వేంచేస్తారు మార్గశిర మాసంలో వైకుంఠ ఏకాదశి మహోత్సవంలో పగల్ పత్తులో పదవనాడు మోహినీ అవతారంలో

నమ్బెరుమాళ్ విజయం చేయడం కుండలినీ శక్తి బయలుదేరి రావడాన్ని సూచిస్తుంది.

ఈ మంటపానికి దక్షిణ భాగాన తురక నాచ్చియార్ (బీబీ నాచ్చియార్) సన్నిధి ఉన్నది. భగవంతునికి అందరూ సమానం అనే సిద్ధాంతాన్ని ఇది సూచిస్తున్నది.

వైకుంఠ ద్వారం :- వైకుంఠ ఏకాదశినాడు స్వర్గ ద్వారం (వైకుంఠ ద్వారం) తెరవడం యోగసాధన పూర్తయిన పిదప బ్రహ్మ రంధ్రం తెరచుకొనడానికి సూచన. పగల్ పత్తు పదినాళ్లూ నమ్బెరుమాళ్ ఊరేగింపుగా ఆరుమెట్లు ఎక్కి మంటపం ప్రవేశించడం యోగి ఆరు ఆధారాలు దాటి పైకివస్తాడనడానికి సూచన.

పెద్ద మంటపం :- ఈ మంటపం పన్నెండు స్తంభాలది. మంటపానికి ఆనుకొని దక్షిణ పశ్చిమ భాగంలో చిన్న అద్దాల అర (గది) ఉన్నది. ఈ గదిలో ఎక్కడ చూచినా తానే కనిపించడం వల్ల తనను మాత్రమే దర్శించే బ్రహ్మభూతస్థితిని అనుభూతికి తెస్తుంది. బ్రహ్మోత్సవ కాలంలో ఇక్కడ అద్దాలసేవ జరుగుతుంది.

సూర్యమండలం చేరితే మన దేహంలో సహజంగానే సుగంధం ఏర్పడుతుంది. ఈ ఉద్దేశంతోనే ఇక్కడ గంధపు చెక్కలతో నిర్మించిన మంటపం ఉన్నది. ఈ మంటపాన్ని శంతను మహారాజు నిర్మించినట్లు పెద్దలు చెబుతారు.

## విశుద్ధ ఆధారం

ఐదవ ఆధారం :- ఐదవ ఆధారం విశుద్ధి. అదే లోపలి మంటపం. ఈ మంటపం ప్రవేశించడానికి ఆరుమెట్లు ఉన్నవి. ఇవి ఆరు ఆధారాలను తెలియజేస్తాయి. వీటిని ఎక్కి వెళ్ళితే, జయ విజయ ద్వారపాలకుల తామ్రి విగ్రహాలు ఉన్నవి. వీరు చూపుడు వ్రేలును పైకెత్తి నిలబడి ఉన్నారు. పరబ్రహ్మ స్థితి ఒక్కటే అనే అనుభూతి పొంది లోపల

ప్రవేశించండి అని దీని తాత్పర్యం. పిదప మూడు పడికట్లు దాటి ముందుకు పోవాలి. ఇది మూడు నాడులనుదాటి పోవాలనడాన్ని సూచి స్తున్నది. వీటినిదాటి ముందుకు వెళ్ళితే మనం అగమంటపం చేరుతాము. అగమంటపమంటే లోపలి మంటపం. అనగా ఆత్మదర్శనం. ఒకే తిన్నని లేఖలో పరమాత్మ ప్రత్యక్షమవుతారు. ఇక్కడ రాత్రి వగలు రెండు వేళలలోను వీణానాదం వినిపించడం సూర్య మండలంలో వినిపించే నాదాన్ని సూచిస్తున్నది. ఈ మెట్లుదాటి లోపల ప్రవేశిస్తే అగమంటపం.

శ్రీరంగ దేవాలయం చుట్టూవున్న సప్త ప్రాకారాలు సప్తలోకాలకు ప్రతీకలని పెద్దలంటారు. మూలస్థానంనుంచి మొదటి ప్రాకారం (ఒక ఫర్లాంగు) సత్యలోకం, రెండవ ప్రాకారం (రెండు ఫర్లాంగులు) తపో లోకం, మూడవ ప్రాకారం (నాలుగు ఫర్లాంగులు) జనోలోకం, నాల్గవ ప్రాకారం (ఆరు ఫర్లాంగులు) మహాలోకం, ఐదవ ప్రాకారం (ఎనిమిది ఫర్లాంగులు) సువర్లోకం, ఆరవ ప్రాకారం (12 ఫర్లాంగులు) భువర్లోకం, ఏడవ ప్రాకారం (20 ఫర్లాంగులు) భూలోకం. ఈ విధంగా ప్రాకారాల నిర్మాణం వున్నది.

## ఆజ్ఞా చక్రం

ఆరవ ఆధారం :- ఆరవ ఆధారం ఆజ్ఞాచక్రం. ఇదే అగ మంటపం-అంతర్మంటపం. ఇది పదహారు స్తంభాలతో చక్రాకారంగా నిర్మితమైంది. దీనిని చంద్రమంటపమని కూడ అంటారు. ఇది చంద్ర కళను సూచిస్తుంది.

గాయత్రీ మంటపం :- ఇది మూలస్థాన విమానారంభంలో వున్నది. ఈ మంటపంలో ఆగ్నేయంగా వరాహమూర్తి, ఈశాన్యంగా అనంతుడు, వాయవ్యంగా నరసింహమూర్తి, వరుణ దిక్కున (దక్షిణ పశ్చిమాన) నారాయణులు, విమానారంభం అడుగున గణపతి విగ్రహం, దాని యెదుట దుర్గామూర్తి ఉన్నవి.

ఇక్కడనుంచి మూల స్థానానికి ఒక మెట్టుదాటి వెళ్లాలి. సాంసారిక బాధను దాటి పరమాత్మను చేరుకోవాలనడానికి యిది సూచన. బ్రహ్మరంధ్రం మూలస్థానాన్ని సూచిస్తుంది. మెట్టు దాటగానే రెండు ప్రక్కల చలువరాతి స్తంభాలు రెండు వున్నవి. ఇవి సూర్యకాచంద్ర కళలను (ఇడా పింగళా నాడులను) సూచిస్తున్నవి. ఈ రెండు స్తంభాలను దాటివెళ్ళితే పద్మంపై మూడుచుట్లు చుట్టుకొని శయ్యగా అమరి, ఐదు పడగలను విప్పి, నాలుకలను చాచి నిట్టనిలువుగా నిలచిన ఆదిశేషునిమీద యోగనిద్రలో వున్న రంగనాథ మూలవిరాట్టు దర్శనమిస్తారు. ఆదిశేషుడే లక్ష్మణుడు, అతడే జీవాత్మ. ప్రతి శుక్రవారం మూలవిరాట్టుకు కస్తూరి, పునుగు కలిపిన తైలంతో అభిషేకం చేస్తారు. అంతేకాక పవిత్రోత్సవ సమాప్తిలోను, శాత్తుముఱై ఉత్సవానికి తర్వాతను తైలాభిషేకం జరుగుతుంది. మరెన్ని జ్యేష్ఠమాసంలో సహస్ర కలశాభిషేకమనే జ్యేష్ఠాభిషేకం నాడు కూడ మూలవిరాట్టుకు సుగంధతైలాభ్యంజనం జరుగుతుంది. ప్రపంచంలో ఒక్క శ్రీరంగంలోనే మూలవిరాట్టు దక్షిణాభిముఖుడై ఉన్నాడు. దక్షిణదిక్కు యమునిదిక్కు. శ్రీరంగనాథుని సేవిస్తే యమునిభయం లేదని దీని అర్థం.

రాత్రి తిరుమంజనం (అభిషేకం)పిదప పెరుమాళ్కు(ఉత్సవులకు) ఎర్రటి గూడకట్టు పంచ ధరింపజేస్తారు. ఫాల్గుణమాసంలో ఉత్తరఫల్గుని నక్షత్రంనాడు మాత్రమే ఉత్సవులు తాయార్ రంగనాయకి సన్నిధిలో ఉండడం ఆచారం. ఇది ప్రాణవాయువు యోగంతో బ్రహ్మరంధ్రాన్ని పొంది, శ్రీశక్తితో ఐక్యం కావడాన్ని సూచిస్తుంది. ఉత్తర ఫల్గుని నక్షత్రంనాడు మాత్రమే అక్కార వడిసెల్ (ఉక్కెర-సేరుటలవక పాలు నేతులతో ఉడికించిన గోధుమరవ హల్వా) ఆరగింపబడి భక్తులకు వినియోగ మవుతున్నది.

ఉదయం విశ్వరూపదర్శన సమయంలో గోమాత పశ్చాద్భాగాన్ని, తనకుంభస్థలాల మధ్యన తీర్థవారి తెచ్చే ఏనుగును, గుర్రంమీద మంగళ వాద్యాలు మోపి మోగించడం వల్ల గుర్రాన్ని, మంగళానికి చిహ్నమైన కన్యను మూలవిరాట్టుముందు నిలిపి పూజిస్తారు. గోమాత పశ్చాద్భాగంలో లక్ష్మి నివసిస్తుందని సంప్రదాయ. కాని ప్రస్తుతం గుర్రాన్ని, కన్యను ఎదుట నిలిపి పూజించే పద్ధతి ఆపివేయబడింది.

విశ్వరూపదర్శన మనేది పరమాత్మ ఎదుట సత్త్వరజస్తమస్సులనే త్రిగుణాలున్న జీవాత్మ స్వరూపాన్ని సూచించడమే.

విశ్వరూపదర్శనంలో గోమాత వెనుక ఉన్న యోని చూవబడు తుంది. దీని తత్త్వమేమంటే, ఆవులను కాచే గోపాలుడనే ఆచార్యుడు ఆవుతోకఅనే ఆశాపాశాలను తొలగించి, యోనిరూపమైన సుషుమ్నా నాడి ద్వారా జీవుణ్ని భగవంతునితో చేరుస్తాడనడమే.

ఏనుగును ఎదుట నిలిపి ఘీంకరించేట్టు చేస్తారు. మావటి వాడయిన ఆచార్యుడు యోగమనే అంకుశంతో ఏనుగనే జీవునికి పర మాత్మ స్వరూపాన్ని చూపుతాడని దీని భావం. భగవద్దర్శనం లభించిందనే సంతోషంతో ఏనుగు ఘీంకరిస్తుంది. జీవునికీ మేళతాళశబ్దాలు వినబడు తాయి.

గుర్రాన్ని నిలువడంలోని ఆంతర్యం-ఆచార్యుడైన రౌతు కళ్లేలనే ప్రాణాయామంతో గుర్రాలనే ప్రాణవాయువును సుషుమ్నలో చేర్చడ మన్నమాట.

కన్యచేతిలో దీపం ఉంచడం ఆచారం. ఇది కుండలినీ శక్తితో జ్యోతి రూపమైన పరతత్త్వాన్ని చూపడం సూచిస్తుంది.

ప్రస్తుతం గుర్రం, కన్య విశ్వరూప దర్శన సమయంలో రావడం లేదు. ఈ సంప్రదాయం పోయింది.

గ్రీష్మోత్సవం ఆరంభమైన మండలం రోజులు గర్భగృహం చుట్టూ తీర్థవారి నింపుతారు. అర్ధయామపూజ ముగిసిన వెంటనే, యీ తీర్థాన్ని తూములు తెరచి వదలివేస్తారు. ఈ పునీతతీర్థంలో స్నానం చేస్తే పాపాదిదోషాలు నివృత్తి అవుతాయని భక్తుల విశ్వాసం.

శ్రీరంగనాథుల మూలస్థానంలో శ్రీ వైకుంఠంలో వేంచేసిన వారందరి స్వర్ణ విగ్రహాలు ఉన్నవి. ఈ విగ్రహాలు యోగుల కండ్లకు మాత్రమే కనిపిస్తాయని పెద్దలు అంటారు. ఈ విగ్రహాలను విభీషణుడు ప్రతిదినం మనకండ్లకు కనిపించకుండా వచ్చి పూజించి వెళ్లుతాడని ఐతిహ్యం. స్వర్గద్వారం (వైకుంఠద్వారం) తెరవగానే పదహారుస్తంభాల మంటపం కనిపిస్తుంది. ఈ స్తంభాలలో పన్నెండు ఒకవిధంగానూ తక్కిన నాలుగు మరొక విధంగాను ఉన్నవి. ఈ పదారు చంద్రకళను సూచిస్తున్నవి.

శ్రీరంగనాథ సన్నిధినుంచి రంగనాయకి ఉయార్ సన్నిధికి వెళ్లే దారిలో శ్రీ పట్టాభిషేకరాముల సన్నిధి ఉన్నది. ఈ సన్నిధి రంగనాథ సన్నిధికి పడమరగా ఉండడంవల్ల మేల్ (పై) పట్టాభిరామ సన్నిధి అని పిలువబడుతున్నది. ఈ సన్నిధికి సమీపంలో మొదటి ఆళ్వార్లయిన పేయాళ్వార్, భూతత్తాళ్వార్, పొయ్‌గై ఆళ్వార్ల సన్నిధి ఉన్నది. వీరు యోగులుగా ఉండి భగవంతుని సాక్షాత్కరించుకొని ఆముష్మికసుఖం పొందినవారు.

స్థలవృక్షం: శ్రీరంగనాథాలయం స్థలవృక్షం పొన్న చెట్టు. శేషశాయి పాలకడలిలో యోగనిద్రలో ఉన్నట్లు ఇక్కడ కావేరీ జలాలలో ఏర్పడిన సుషుమ్నానాడి వంటి శ్రీరంగనగరంలో వేంచేసి ఉన్నారు.

కావేరి చల్లదనమిచ్చే ఏరు. సముద్రంనీరు ఉప్పన. కావేరీనది పొన్ని అని వ్యవహరింపబడుతున్నది. (పొన్ని అంటే బంగారునది

స్వర్ణ నది.) అనగా ఇది స్వర్ణశక్తి గలది. నీటిలో మునిగేవారికి, గట్టున వాహ్యాళిజరిపేవారికి చల్లదనం కలిగిస్తుంది.

పొన్న నూనె : పొన్న చెట్టు కాయలనుంచి తీసేనూనె సన్నిపాతాన్ని, పిల్లలకు వచ్చే ఈడ్పును. ఐదు విధాల నొప్పులను, వ్రణాలను, క్రిములను పోగొడుతుంది. దీని పూవులు దీర్ఘ వ్యాధిని, చిత్తభ్రమను, కరప్పాణి, గజ్జి, దురదలు మొదలైనవాటిని పోగొడుతుంది. దీని గింజలు చెవిపుండు, సన్నిపాతం, వాతం, సూతకవాయువు, శీతలవాయువులను తొలగిస్తాయని వైద్యగ్రంథాలు తెలుపుతున్నాయి. కాగా, కావేరిలో స్నానంచేసి, పొన్న చెట్టుకు ప్రదక్షిణంచేసి, చంద్రపుష్కరిణిలో స్నానం చేసి, వైద్యశాస్త్రాధిదేవత అయిన ధన్వంతరికి నమస్కరించి, రంగనాథుని సేవిస్తే వ్యాధులు తొలగి, మనస్సు నిర్మలమై చంద్రమండల మార్గాన భగవంతుని పాదకమల సన్నిధి చేరుతారనే రహస్యం స్పష్టమౌతుంది.

వీటన్నిటి అమరికకూడ అట్లేఉన్నది. కావేరి, కావేరినుంచి రాగానే ధన్వంతరి, ధన్వంతరి పర్యవేక్షణలోనే పొన్న చెట్టు, పుష్కరిణి, పిదప దక్షిణంగా వెళ్లితే రంగనాథాలయం.

చంద్రపుష్కరిణి : రంగనాథాలయం సమీపంలోనే యీ పుష్కరిణి వర్తులాకారంలో ఉన్నది. ఇది ప్రాణ మనస్సులకు సంకేతం. ప్రాణాన్ని-ఉచ్ఛ్వాసనిశ్వాసాలను బంధిస్తే మనస్సుకూడ కట్టుపడుతుంది. ప్రాణాన్ని అణచి మనస్సునూ అణచివేయాలి. మనస్సు అణగితే లోకం వశమవుతుంది. లోకం వశమైతే ఆత్మానుభూతి కలుగుతుంది. ఊపిరి వ్యయంకావడం ఆయుర్వ్యయం. "ఊపిరి పోయింది, ఆగింది వని" మనదేహంలో నవద్వారాలున్నవి. ఈ కారణంవలననే యీ క్షేత్రంలో తొమ్మిది తీర్థాలు ఏర్పడ్డాయి. వీటిలో చంద్రపుష్కరిణి శ్రేష్ఠమైనది. ఎనిమిది దిక్కులలోను ఉన్న తక్కిన తీర్థాలు ఇవి: బిల్వ తీర్థం, అచ్యుత

తీర్థం, అశ్వత్థతీర్థం, పలాశరతీర్థం, పున్నాగ తీర్థం, వరుణతీర్థం, కదంబ తీర్థం, ఆమ్రతీర్థం.

ఈ చంద్రపుష్కరిణి ధన్వంతరి ఆలయానికి ఎదుట ఉన్నది. ఈ ప్రాంతాన్ని దాటగానే సకల పాపాలు, సకల వ్యాధులు తొలుగుతా యని విశ్వసిస్తారు. యోగాగ్ని వల్ల జన్మాంతర పాపాలుకూడ తొలగు తాయి.

ఐదుగుంతలు-మూడుద్వారాలు : ఇక్కడున్న ఐదు గుంతలలోను అడుగున తామరపూవుల శిల్పాలున్నవి. వీటికి సమీపంలో రెండుస్తంభాలు ఇరుకుగా నాటబడిఉన్నవి. ఈ రెండుస్తంభాలు ఇడాపింగళకు సంకేతం. అట్టడుగు అనేది ప్రాణవాయువు. ఈ ప్రాణాన్ని మీదికి బ్రహ్మ స్థానానికి తీసుకొని వస్తే, సహస్రారం చేరవచ్చు. అప్పుడు తామర పూవు పూయడం ప్రారంభిస్తుంది. దీనిని సాధకులు తమతమ అనుభవ ములో శిరస్సులో సహస్రారంలో జరిగే ప్రక్రియనుబట్టి తెలుసుకోవచ్చు. దీనిని ఋరదరేక పూచే పూవు అని తిరుమంత్రంలో తిరుమూలర్ అనే తమిళయోగి వర్ణించారు. మూడు ద్వారాలలో ఒకటయిన రంగనాయకి తాయార్ సన్నిధి ద్వారంలో ఒక మెట్టు వున్నది. ప్రపంచ వ్యవహారా లన్నిటినీ వదలి పరబ్రహ్మ ఒక్కటే అని భావించి ఒకమెట్టు దాటితే రంగనాయకి తాయార్ అనే కుండలినీ శక్తి లభిస్తుందని దీని భావం. ఈ సన్నిధి మనకు లభించగానే, జ్ఞానమంతా లభింవ నారంభిస్తుంది.

మరొకపక్క మూడు ద్వారాలలో ఒకదానికి యోగ నరసింహ సన్నిధి నుంచి ధన్వంతరి సన్నిధికి వచ్చే దారిలో నాలుగు మెట్లువున్నవి. ఇవి నాలుగు వేదాలకు ప్రతీక. వేదశాస్త్ర జ్ఞానం పొందిన పిదప స్వర్గ ద్వారం లభిస్తుందని భావం. ఈ స్వర్గ ద్వారానికి మెట్లు లేవు.

తాయార్ సన్నిధి :- రంగనాయకి తాయార్ కోవెల ముందు భాగంలో ఆంజనేయులు స్తంభం చెక్కబడినారు ప్రాణవాయువే ఆంజనేయులు. ఆలయంలో ప్రవేశించి తిరిగి వచ్చేటప్పుడు దారిలో ఐహిక సుఖ శిల్పాలు, రామాయణ దృశ్యాలు, అవతార పురుషుల శిల్పాలు వున్నవి.

డోలోత్సవ మంటపం :- దీనిని ఊంజల్ (ఊయెల) మంటపమని అంటారు. అన్ని విధాలయిన చాంచల్యాలు యింతటితో ఆగిపోవాలని యిది సూచిస్తున్నది.

తులసి కోట :- ఉత్తర ప్రాకారంలో తులసీకోట ఉన్నది. దాని కింద వున్న కూర్మ విగ్రహం పంచేంద్రియాలను అణచడం అవసరమని దాన్ని సూచిస్తుంది తులసికోట మేరవు. వాసుకి గాలి మాత్రమే ఆహారంగా గ్రహించి, మరే ఆహారమూ లేక జీవిస్తుందనేది పెద్దలు చెబుతున్న మాట. ఇక్కడ అమృతం పొంది ఐదుమెట్లు దాటి అగమంటపాన్ని (అంతస్థ మంటపాన్ని) ప్రవేశించాలి.

అగ్రమంటపంలో అష్టలక్ష్ములు వున్నారు. ఈ స్థలం చేరగనే యోగి అష్ట మహా సిద్ధులను పొందుతాడని దీని ఆంతర్యం. మెట్లమీద పన్నెండు రాశులు చెక్కివున్నవి. ఇటుపిమ్మట గ్రహ ప్రభావం, విధి అనేవి తొలగిపోతాయి. వీటిని దాటిన పిదప తాయార్ రంగనాయకి సేవ లభిస్తుంది.

## తాయార్ తత్త్వం

రంగనాయకి సన్నిధిలో విశేషోత్సవాల ప్రారంభ సూచకంగా ధ్వజారోహణాధులు వుండవు. ఈ సన్నిధిలో శ్రీదేవి, భూదేవి, కర్మార్చి అనే మూడు విగ్రహాలున్నాయి ఇవికాక తాయార్ ఉత్సవ విగ్రహం, ఊరేగింపులకు వెళ్ళేటప్పుడు కర్మార్చి విగ్రహం పూజాదులకు ముఖ్యమైనది.

రంగనాయకి తాయార్ తత్త్వం: మొదటి నుంచి మనకు జీవశక్తి

అనుగ్రహించి దారిచూపే శక్తే తాయార్. రంగనాయకి గడపదాటిపోని మహా పతివ్రత. మనం మన శక్తిని ఎల్లలో పెట్టుకొని అభివృద్ధి పరచుకోవాలనడం దీని తాత్పర్యం. అంతేకాక ప్రాణశక్తిని వెలుపలికి పంపక నిలుపాలనికూడ దీని సూచన. వీర్యాన్ని, ప్రాణవాయువును మనం కట్టుబాటులో వుంచుకోవా లన్నది దీని భావం.

తాయార్ సన్నిధి వెనుకభాగంలో వసంతమంటపం విడిగా ఉన్నది. కడపదాటని తాయార్ సన్నిధిలో గ్రీష్మోత్సవం, వసంతోత్సవం, నవరాత్రి, డోలోత్సవం, వైకుంఠైకాదశి మొదలైన ఉత్సవాలు విడిగా జరుగుతాయి. వైకుంఠైకాదశి ఉత్సవం మొత్తం పదినాళ్లు మాత్రమే ఇక్కడ జరుగుతుంది.

తాయార్ సన్నిధినుంచి వెలుపలికిరాగానే కంబ మహాకవి తన రామా యణ మహాకావ్యాన్ని విద్వాంసుల సభలో ఆవిష్కరించిన నాలుగు స్తంభాల మంటపం ఉన్నది. ఈ నాలుగు స్తంభాలలో చెరి నాలుగు స్తంభాలున్నవి. ఈ విధంగా ఇవి మొత్తం పదహారు స్తంభాలవుతాయి.

దేశికులసన్నిధి :- తాయార్ సన్నిధికి ముందు భాగంలో ఎడమవైపున తిరుమల శ్రీ వేంకటేశ్వరుని సన్నిధిలోని ఘంటావతారమైన వేదాంత దేశికుల సన్నిధి ఉన్నది. మానవునికి మనశ్చాంచల్యం అణగిపోయిన పిదప నాదబిందు స్వరూపుడైన భగవంతుని సాక్షాత్కరింపజేసే ఆచార్యుడు లభిస్తాడనే రహస్యాన్ని దేశికుల సన్నిధి సూచిస్తున్నది. నాదసాక్షాత్కారానంతరం సంసారమార్గం విచ్ఛేదం పొందుతున్నట్లు దీనికి ఎడమవైపున యోగ నరసింహ సన్నిధి ఉన్నది.

కంబ రామాయణ ప్రారంభోత్సవ మంటపం ఎదుట ఎత్తయిన వేదికపై యోగ నరసింహస్వామి ఆసీనులై ఉన్నారు. యోగంలో ఉన్నతి సాధించిన వారు తమకు మంచి జరిగినా, చెడు జరిగినా భేదం లేక ఒక్కటిగానే భావించి, నవ్వుతూ ఉంటారనడాన్ని తెలుపడానికి యోగ నరసింహమూర్తి నవ్వుతున్నట్లు తీర్చబడింది. కంబ మహాకవి హిరణ్యకశిపు వధ కథను వినిపించినప్పుడు ఈ యోగ నరసింహ విగ్రహం అట్టహాసం చేసిందట.

యోగంలో మాతయైన రంగనాయకి తాయార్ దర్శనంకాగానే, ఎవరైనా అవతార పురుషులు కావచ్చు ననడానికి సూచనగా తాయార్ సన్నిధిసమీపంలో ఉన్న చంద్ర పుష్కరిణి తూర్పుగట్టున పట్టాభిరామ సీతాలక్ష్మణాంజనేయుల మూర్తులు ఉన్నవి. తర్వాత ఉన్న సన్నిధిలో ఆండాళ్, శ్రీదేవి, భూదేవి, నీలాదేవి, పరమపదనాథులు, కులశేఖరాళ్వార్, పొయ్‌గైయాళ్వార్, భూతత్తా

శ్వార్, పేయాళ్వార్, తొండరడిప్పొడియాళ్వార్, తిరుప్పాణాళ్వార్, మధుర కవి యాళ్వార్, తిరుమంగైయాళ్వార్, నాథముని, గరుడుడు, విష్వక్సేనులు, రామానుజులు, పిళ్లైలోకాచార్యుల మూర్తులు ఉన్నవి.

ఇక్కడ బట్టబయలున వేణుగోపాలస్వామి సన్నిధి ఉన్నది. ఈ సన్నిధిలో రాత్రిపూట పాలు వినియోగంచేసేవారు. యోగంలో ఉన్నతి సంపాదించిన మీదట బట్టబయలులో సహస్రారంలో అమృతం లభిస్తుందనడాన్ని పాలు విని యోగం సూచిస్తుంది.

కంబరామాయణం మంటపానికి వెనుక వైపు కర్తృ మంటపం ఉన్నది. ఇక్కడే నమ్మాళ్వార్ మొదలైన పదుగురు ఆళ్వార్లు అనుగ్రహించిన దివ్య ప్రబంధానికి వ్యాఖ్యాత అయిన పెరియవాచ్చాన్‌పిళ్లై - అనగా శ్రీకృష్ణసూరి సన్నిధి ఉన్నది. యోగ నరసింహాలయ సమీపంలో వాసుదేవపెరుమాళ్ సన్నిధి ఉన్నది. యోగమనే శబ్దానికి ధ్యానమని అర్థం. భగవంతుని ధ్యానించుటవలన భగవంతుడు మనకు దర్శనం అనుగ్రహిస్తాడు. అతడే అంతటా వ్యాపించిన వాసుదేవుడు. అతని దర్శనంకాగానే జ్ఞానం సిద్ధిస్తుంది.

ఇక్కడే కులశేఖరాళ్వార్ల సన్నిధి కూడ ఉన్నది. లోకమాత అయిన శ్రీరంగనాయకి దర్శనంవల్ల భగవంతుని పొందడం సాధ్యమౌతుందని కుల శేఖరమూర్తి తెలుపుతున్నది.

ఈ సన్నిధికి సమీపంలో వ్యాసభగవానుని సన్నిధి ఉన్నది. వేణుగోపాల సన్నిధికి సమీపంలో శ్రీ వేంకటేశ, భోజరామ, భక్తిసారుల ఆలయాలున్నవి. భక్తిసారులు మహాయోగులు. ఈయన మొదట యోగులుగా ఉండి భగవంతుని యందు లీనమయినవారు. యోగి తన యోగంతో పరమాత్మయందు లయమవు తాడనే తత్త్వాన్ని ఇది తెలియజేస్తున్నది.

## సహస్రారం

వేయిస్తంభాల మంటపం :- తాయార్ సన్నిధికి ఎదుట ఈ వేయిస్తంభాల మంటపం ఉన్నది. ఇది సహస్రారం. జ్యోతిస్వరూపమైనది. మార్గశిర మాసంలో ఈ మంటపం దీపకాంతితో వెలిగిపోతుంది. ఈ జ్యోతిస్థితిని పొందడమే అంతిమ లక్ష్యమని, ఈ స్థితిని పొందితే, తలచినప్పుడు తలచినచోటికి రాకపోకలు సాగించవచ్చునని ఈ మంటపంలో ఉన్న రాతి రథం సూచిస్తున్నది.

వేయిస్తంభాల మంటపానికి ఎదుట ఉన్న మంటపానికి శేషగిరి రాయర్ మణి మంటప మని వ్యవహారం. శ్రీరంగంకోవెలలోని అత్యంత సుందర శిల్పాలన్నీ ఈ మంటపంలోనే ఉన్నాయి. అసాధారణమైన హస్తకౌశలం, సౌందర్యంగల శిల్పాలు ఈ మంటపంలో ఉన్నాయి. ఈ మంటపానికి దక్షిణాన పెక్కు వైష్ణవ సంప్రదాయ గ్రంథాలు రచించిన పిళ్లైలోకాచార్యుల ఆలయం ఉన్నది.

పశ్చిమద్వారానికి వెలువల తెప్పోత్సవం జరిగే పుష్కరిణి ఉంది దీనిని తెప్పకుళం - తెప్ప కొలను - అంటారు. తెప్పకొలనులోని పెరుమాళ్ల్ విగ్రహం తలలోని సహస్రాకారాన్ని సూచిస్తుంది. తెప్పకొలను పక్కన పాముపుట్ట ఉండడం నాదాన్ని సూచిస్తుంది.

అడైయవళైందాన్ వీధికి దక్షిణ పశ్చిమ మూలలో వెళి ఆండాళ్ సన్నిధి ఉన్నది. ఈ సన్నిధిలో గోదాదేవి మూలవిరాట్టు. గోదాదేవి ఉత్సవ విగ్రహానికి ముస్లిములదండయాత్ర సమయంలో లోపల విడిగా సన్నిధి నిర్మించ బడింది.

## శ్రీరంగం తిరు వీధులు

శ్రీరంగంలోని వీధుల వివరం :- రాజగోపురం ఉన్న ప్రాకారంలో నాలుగు వైపుల ఉన్న వీధులకు అడైయవళైందాన్ వీధులని పేరు. ఈ వీధులు దేవాలయాన్ని నాలుగు దిక్కులా చుట్టు ముట్టి ఉన్నవి. కాని ఈ వీధిలో దక్షిణ భాగంలో కొంతభాగాన్ని సాత్తార్ వీధి అని, రెండవ భాగాన్ని కొల్లువప్పట్టరై వీధి అని వ్యవహరిస్తారు. సాత్తార్ వీధిలో సాతాని శ్రీ వైష్ణవులు, కొల్లువప్పట్టరై వీధిలో కమ్మరివనివారు, ఇతర వృత్తులవారు ఉండేవారు.

చిత్రవీధి :- రెండవప్రాకారంలోని వీధులకు చిత్రవీధులని పేరు. బ్రహ్మతత్వాన్ని తెలిసిన జ్ఞానులు ఈ చిత్రవీధులు నాలుగింటిలోను నివసించే వారని తెలుస్తున్నది.

కూరత్తాళ్వార్ దివ్య భవనం :- చిత్ర వీధి పూర్వభాగంలో మొదట కూరత్తాళ్వార్ దివ్య భవనం ఉంది. ఈయన రామానుజుల శిష్యుడు. ఈయన ఈభవనంలో నివసించినారు. ఈయన గొప్పతనం కూరత్తాళ్వార్ సన్నిధి వివరణలో ఉన్నది.

పెరియనంబి భవనం :- శ్రీరామానుజుల గురువైన పెరియనంబి (మహా పూర్ణుల) భవనం తూర్పు చిత్రి వీధిలోనే ఉంది. ఈయన రామానుజులకు తిరుమంత్రోపదేశం చేసినవారు. రామానుజులను మహాయోగిగా చేసినవారు ఈయన.

ముదలియాండాన్ భవనం :- మొదలియాండాన్ రామానుజుల మేన ల్లుడు. ఇతనికి దాశరథి గురువని నామాంతరముంది. ఈయన భవనం తూర్పు చిత్రి వీధిలో ఉంది. ఈయన రామానుజుల అంతరంగ శిష్యులు, మహాజ్ఞాని. మొదట ఈయన శ్రీరంగం కోవెలలో మణియం పనిచేసేవారు. శ్రీరంగవాసి అయిన కోవిల్ అణ్ణన్-వాధూల వరదనారాయణ గురువు ఈ వంశంవారే.

వాధూల రంగాచార్యుల భవనం : ఈభవనం కూడ తూర్పు చిత్రి వీధి లోనే ఉన్నది. ఈయన పూర్తి పేరు అప్పన్ ప్రణతార్తిహర రంగాచార్యస్వామి. ఈయనకు కోవెల ధర్మకర్త పదవి అప్పగించబడింది. తక్కిన కైంకర్య మర్యాదలన్నీ వాధూల అణ్ణన్ కైంకర్య మర్యాదలతో సమానమైనవి.

కిడాంబి వారి భవనం :- ఈ భవనం తూర్పు చిత్రి వీధిలో ఉన్నది ఈయన భగవద్రామానుజులకు మడైప్పళ్లి సేవ చేసిన వారు-అనగా పాచకులు.

వానమామలై మఠం :- ఇది తూర్పుచిత్రి వీధిలో ఉన్నది. ఇది వాన. మామలై జీయర్ స్థాపించినది. ఈయన భాద్రపద మాసంలో పునర్వసు నక్షత్రంనాడు వానమామలై అనే చోట జన్మించారు. ఈయన మణవాళ మహా మునికి ముఖ్య శిష్యులు.

దక్షిణ చిత్ర వీధిలో కిడాంబి భావనాచార్యుల భవనం ఉంది. ఈయన కిడాంబి వాధూల రామానుజాచార్యుల సోదరులు. వీరికి రంగనాథాలయంలో తీర్థప్రసాద మర్యాదలున్నవి.

దక్షిణ చిత్ర వీధిలో కృష్ణదేవాలయం ఉంది. కృష్ణుడు జన్మించిన కృష్ణ జయంతినాడు ఈ దేవాలయంలో మాత్రమే ప్రపంచ శ్రేయస్సు కోసం తైలం, శుండల్ (సెనగపప్పు గుగ్గిళ్ల) ప్రసాద వినియోగం జరుగుతుంది.

చిత్ర వీధి వాయువ్యమూలలో వేదాంత దేశికుల సన్నిధి ఉంది. ఈయన మహా విద్వాంసులు. వీరికి రామానుజాచార్యులతో సమానమైన ఆచార్య స్థానం వుంది. శైవసిద్ధాంతం ప్రబలినకాలలో వీరు శైవ పండితులతో వాదించి విశిష్ట

ద్వైతమే నిజమైనదని నిరూపించినవారు.వేదాంత దేశికులు లేకపోతే విశిష్టాద్వైతమే లేదు.

ఉత్తర వీధి :- ఇది మూడవ ప్రాకారంలో నాలుగు వైపులా ఉంది. ఈ వీధిలో ఇండ్లు రంగనాథాలయానికి అభిముఖంగా ఒకవైపుననే ఉన్నవి. ఈ నాలుగు వీధులు బ్రహ్మ నిష్ఠులు నివసించిన వీధులు.

మణవాళ మహా ముని భవనం :- ఉత్తర వీధిలో ఆగ్నేయ మూలలో ఆదిశేషుని దివ్యావతారమైన శ్రీమణవాళ మహాముని అనే గొప్ప వైష్ణవాచార్యుల కోవెల ఉన్నది. వీరి సమాధి ఈ కోవెల వెనుక ఉన్నది. వీరు పరమపదించిన మాఘ బహుళ ద్వాదశినాడు గొప్ప ఉత్సవం జరుపుతారు.

చిత్ర వీధుల్లోను, ఉత్తర వీధుల్లోను రంగనాథాలయంలో పనిచేసేవారి ఇండ్లు, పరంపర మఠాధిపతుల వేర్వేరు మఠాలు, దక్షిణోత్తర భారత భక్తులు బసచేసే రామానుజ కూటాలు ఉన్నవి.

రంగనారాయణ జీయర్ :- ఉత్తర వీధిలోని మఠానికి ఈయన అధిపతి. మూలవిరాట్టుకు తైలం సమర్పించి ఉద్వర్తనాదులు చేయడం ఈయన కైంకర్యం. యోగంవల్ల కలిగే వేడిని చల్లార్చడానికి తైల లేపం అవసరం. దీనిని మహా యోగిఅయిన రామలింగస్వామి పంచకల్పమని అన్నారు.

(నేను యోగంవల్ల కలిగే వేడిని తగ్గించడానికి కుమారీ తైలాన్ని వాడుతూ వచ్చాను. ఈ తైలం కలబందతో తయారవుతుంది. ఇది చల్లదనం కలిగిస్తుంది. కలబందను లోపలికి కూడ పుచ్చుకోవచ్చు.)

ప్రబంధ గాయకుని భవనం :- శ్రీరంగనాథుని సన్నిధిలో దివ్య ప్రబంధాన్ని రాగతాళాలతో, అభినయ పూర్వకంగా గానంచేసేవారు తిరువరంగ పెరుమాళ్ అరైయర్ అనేవారు. ఈయన నివసించిన గృహం తూర్పు ఉత్తర వీధిలో ఉన్నది. ప్రస్తుతం ఈ కైంకర్యాన్ని ఆయన వంశంవారు నిర్వహిస్తున్నారు.

వాధూల అణ్ణన్ భవనం :- తూర్పు ఉత్తర వీధి దక్షిణపు చివర వాధూల అణ్ణన్ భవనం ఉన్నది. కార్తీక దీపోత్సవం తర్వాత జరిగే అధ్యయనోత్సవానికి నమ్మాళ్వారును ఆహ్వానించడానికి రంగనాథుని నుంచి లేఖ తెచ్చి నమ్మాళ్వారుకు సమర్పించడం ఈయన పని. పవిత్రోత్సవ సమాప్తినాడు పవిత్ర మర్యాదలు ఈయన పొందేవారు.

పరాశర భట్టర్ భవనం :- ఈ భవనం దక్షిణ ఉత్తర వీధి మధ్యలో ఉన్నది. మార్గశిర మాసంలో భగవంతుని సమ్ముఖంలో వేదాధ్యయనం చేయడం, కార్తీక మాసంలో కైశిక పురాణపఠనం వీరి పని. వీరిసోదరులు వ్యాసభట్టర్. ఆయన వంశంవారు ఉత్తర ఉత్తరవీధిలో నివసిస్తున్నారు.

ఉత్తమనంబి భవనం :- ఉత్తర వీధి దక్షిణ పశ్చిమ మూలలో ఈ భవనం ఉన్నది. కార్తీకమాసంలో దీపోత్సవంలో దీపం వెలిగించడం ఉత్తమ నంబి పని. ఇది గురుయోగ దీపాన్ని, అనగా యోగాగ్నిని ప్రజ్వలింపజేయ డాన్ని సూచిస్తుంది.

శ్రీరంగామృతకవి భవనం :- ఇది ఉత్తర వీధిలో ఉన్నది. ఈయనకు తిరువరంగత్తముదనార్ అనికూడ పేరు. రంగనాథుని సన్నిధిలో ఆరాధన సమయంలో వేదపఠనం, ధూపం అందించడం ఈయన పనులు. వేద మంత్రాలతో యోగాగ్నిని ప్రజ్వలింపజేయడం, భగవంతుని ఉపాసించడం దీని వల్ల సూచిత మవుతున్నవి.

వేదాంత దేశిక గృహం :- ఉత్తర ఉత్తర వీధిలో వేదాంతదేశికులు నివసించిన గృహం ఉన్నది. వీరు మహా విద్వాంసులని ఇదివరకే చెప్పబడింది. వీరు విశిష్టాద్వైత గ్రంథాలు నూటికిపైగా రచించారు. వీరు ఈ గృహంలో నివసించినట్లు పెద్దలు చెబుతారు. యోగంవల్ల ఆత్మ పరమాత్మల స్థితిని సాక్షాత్కరించుకొనిన వారు మహాజ్ఞాను లవుతారని దీనివలన స్పష్టమవుతున్నది.

ఎంబార్‌స్వామి భవనం :- ఇది ఉత్తర ఉత్తర వీధిలో ఉంది. వీరు రామానుజుల పినతల్లి కుమారులు. వీరు చిరు ప్రాయంలోనే పాశాలన్నింటినీ తొలగించుకొని సన్యాసాశ్రమం స్వీకరించినవారు. వీరు తమ గురువయిన రామానుజుల అనుగ్రహంవల్ల హృదయ కమలంలోని భగవంతుని ధ్యానించి సద్గతి పొందారు. గురుకృపతో, యోగమార్గంలో హృదయ కమలంలోనే భగవంతుని సాక్షాత్కరించుకొన వచ్చునని దీనిభావం.

అహోబల మఠం :- ఇది తూర్పు ఉత్తర వీధిలో ఉన్నది. దీనిలో యోగనరసింహులు వేంచేసి ఉన్నారు. ప్రహ్లాదుడు పరమాత్మను మనస్సులో ధ్యానించడంవల్ల సకల విపత్తులను గడచినాడు. భగవంతుడు స్తంభంలో సాక్షాత్కరించి ప్రహ్లాదుణ్ని కాపాడినాడు. ఆవిధంగానే యోగాభ్యాస పరులను భగవంతుడు ఏదో విధంగా కాపాడుతాడు అని దీని భావం.

అరైయర్ భవనం :- ఇది తూర్పు ఉత్తర వీధిలో ఉంది. అరైయర్ అనే వారు రంగనాథుని సన్నిధిలో తమిళ వేదమైన దివ్య ప్రబంధాన్ని పఠించిన తిరువరంగప్పెరుమాళరైయర్ వంశంలో జన్మించిన వారు. ఈ వంశం మూల పురుషుడు 115 సంవత్సరాలు జీవించారట. దీనిని బట్టి భగవంతుని ధ్యానిస్తూ, అతని దివ్యనామ సంకీర్తనం చేసేవారు దీర్ఘకాలం జీవించగలరని, వారి వంశం భగవంతుని సేవచేసే భాగ్యం పొందుతుందని స్పష్టమవుతున్నది.

కందాడై రామానుజ మఠం :- దక్షిణ ఉత్తర వీధిలో ఈ మఠం ఉన్నది. శ్రీరంగనాథుని ఉత్సవం వీధిలో బయలుదేరినప్పుడు, శ్రీరంగనాథునికి అంగరక్షకుడుగా ఉండే కైంకర్య భాగ్యం కందాడై రామానుజులకు లభించింది. వీరి శిష్యుడైన పిళ్ళై యురంగా విల్లి దాసన్ - ధనుర్దాసస్వామి - ఈ మఠాన్ని స్థాపించారు. ఈయన కామోపభోగియై భార్యా సౌందర్య మోహితుడై ఉన్న వాడు. కందాడై రామానుజుల అనుగ్రహంతో సుందర జామాత అయిన రంగ నాథుని దర్శించి భవ పాశాన్ని పోగొట్టుకొన్నవాడు. గురుకృపతో భగవంతుని దర్శించిన వారికి భవపాశాలు తెగిపోతాయని, ఆ వంశంలో భగవత్సేవ చేసే వారు జన్మిస్తారని తెలుసుకోవచ్చును.

తూర్పు ద్వారం :- ఉత్తరవీధి దాటి ఈవలికి చిత్రవీధిలో ప్రవేశించే టప్పుడు ఉన్న తూర్పు ద్వారంలో కామ పురుషార్థ శిల్పాలు చాల ఉన్నవి. కామోపభోగం వలన మానవుడు చిన్నవాడైపోతా డనడాన్ని ఇవి సూచిస్తు న్నవి. అందువలననే ఈ ద్వారంపై ఉన్న గోపురాన్ని కట్టై గోపురం అంటారు.

వెళ్ళై గోపురం (తెల్లగోపురం) మీద మాత్రమే శిల్పాలు చాల తక్కువగా ఉన్నాయి. ఆత్మ సహస్రారాన్ని అంటిపెట్టుకొని ఉండడం వల్ల నిర్మలమై నిటా రుగా ఉన్నతంగా నిలబడుతుందని ఈ తెల్లగోపురం సూచిస్తున్నది. తర్వాత క్రిమక్రమంగా ప్రాపంచిక భావనలలో చిక్కుకుంటే క్రిమంగా చిన్నవాడై పోవడాన్ని క్రింది ద్వారగోపురాలు సూచిస్తున్నవి. ఈ గోపురాలను దాటితే మనకు కనిపించేది శ్మశానం. యోగ పద్ధతిలో నడవని మానవుల జీవితం పరా జయంపొంది వ్యర్థమై మడిసిపోతుందనడానికి ఇది సూచన.

బోడిగోపురాలు:- మొదటి పెద్దప్రాకారంలో తూర్పు, ఉత్తరం, పడమర ద్వారాల గోపురాలు పూర్తికాక కొంతవరకే లేచి ఆగిపోయాయి. వీటిని బోడి

గోపురాలంటారు. ఇవి పూర్తికాక నాలుగు స్తంభాలు మాత్రమే పాతివున్నవి. మనప్రయత్నంతో మనమే యోగదశను పొందవలె ననడాన్ని, ఈ గోపురాలను కట్టి ముగించక విడిచి, మనం కట్టిముగించాలని చెప్పుతున్నట్టు భావించవచ్చు. మనమే కట్టి ముగించాలి.

## ఈ దేవాలయంలో నైవేద్య పద్ధతులు

ఈదేవాలయంలో వివిధ సేవానైవేద్యాలు ఈవిధంగా ఉన్నాయి:-

| | | |
|---|---|---|
| ఉదయం | 6-15 | విశ్వరూపం |
| ,, | 8-30 | ఉడికించిన పెసరపప్పు, రొట్టె, పాలు, వెన్న. |
| ,, | 9-00 | ఉప్పుపొంగలి, దోసె, శొంఠబెల్లం, అరటికాయ కూర, నిమ్మకాయ ఊరుగాయ |
| మధ్యాహ్నం | 12-00 | పరమాన్నం, అన్నం, కూర, మిరియాలచారు, పెసరపప్పు, అతిరసాలు (అరిసెలు). |
| సాయంత్రం | 6-00 | వడ, అప్పాలు, తేన్‌గుళల్ (జంతికలవంటివి), క్షీరాన్నం, రంగనాయకి తాయార్ సన్నిధిలో పిట్టు. |
| రాత్రి | 9-00 | అన్నం, పెసరపప్పు, దధ్యోదనం (పెద్దసన్నిధి), అరవణై (ఒక విధమైన చక్కెర పొంగలి), అరటికాయ కూర ( తాయార్ సన్నిధి), అరవణై, ఆకు కూర. |
| ,, | 9-30 | పాలు |

ప్రతి శుక్రవారం మధ్యాహ్నం 3-00 గంటలకు రంగనాథునికి తైలాభిషేకం జరిపిన పిదప దోసె, పులిహోర, టెంకాయ, అరటిపండ్లు, నాటు చక్కెర నైవేద్యం చేస్తారు.

యోగసాధకుడు ఆరంభంలో దేవాలయంలో నైవేద్యం చేసే ఆహారం వంటి ఆహారాన్ని భుజించాలి. ఇంతటి ఆహారాన్ని యోగాగ్ని పచనం చేస్తుంది. తర్వాత క్రమక్రమంగా పైన పేర్కొన్న ఆహారాన్ని తగ్గించుకొంటూ ఉప్పు, చింతపండు, మిరపకాయలు, నూనె మున్నగు వాటిని వదలి, బియ్యం, పెసలు

కలిపి ఒక పిడికెడు మాత్రం పాలలో పొంగించి, ప్రతిదినమూ ఒకేపూట మాత్రమే భుజించి, రాత్రి ఆవుపాలు మాత్రం తాగాలి. ఈ పద్ధతిలో కోవెల నైవేద్య ప్రసాద పద్ధతి ఏర్పడింది.

దీని తర్వాతి స్థితి వాయుభక్షణం మాత్రం. ఆ స్థితే పరవాసుదేవ స్థితి. ఆ దశ గగనమార్గంలో ఎగిరే దశ. ఆ స్థితి పొందితే దేహం స్వర్ణమౌతుంది. దీనిని గర్భగుడి గోపురానికి బంగారు కవచం అమర్చి తెలియజేయడం జరిగింది. విమానం చుట్టూ 187 కు పైగా దేవతా విగ్రహ శిల్పాలున్నవి. వీటితో పాటు 230 పరివార శిల్పాలు ఉన్నవి. వీటి వివరాలు పాంచరాత్రాగమానికి చెందిన పారమేశ్వర సంహితలో చూడవచ్చు.

## దేహం-శ్రీరంగ దేవాలయం

విమానం దక్షిణభాగంలో పరవాసుదేవుడు, పశ్చిమభాగంలో అచ్యుతుడు, ఉత్తరభాగంలో అనంతుడు, తూర్పుభాగంలో గోవిందుడు మొదలైన దివ్య రూపాలు ఉన్నవి. సేనై ముదలియార్ (విష్వక్సేన) సన్నిధి సమీపంలో క్రింద బంగారు పాదాలు ఉన్నవి. పాదం అంటే ప్రాణవాయువు. ప్రాణాయామ యోగాభ్యాసం చేయడం వల్ల మనం ఆ స్థితిని పొందవచ్చును. ఈ యోగస్థితికి వివరణగా శ్రీరంగదేవాలయం నిర్మించబడింది. మనకు నవద్వారాలు ఉన్నట్లు కోవెలలోను నవతీర్థాలు ఏర్పాటు చేయబడినవి. మనదేహంలో నవద్వారాల మూలంగా మన ప్రాణవాయువు పారుతూ వ్యయమైపోతున్నది. ఈ ప్రాణ వాయువును నవద్వారాలలో పారకుండా ఒకచోటికి చేర్చి యోగ మార్గంలో శ్రీ రంగనాథుడు యోగనిద్రలో శయనించిన స్థితిని పొందగల అభ్యాసం చేస్తే గగన మార్గంలో మనం విహరించ వచ్చు. గూడు విడిచి మరొక గూడు చేర వచ్చు. దీనిని-వరకాయ ప్రవేశాన్ని-తిరుమూలర్ అనే మహాయోగి చేసిచూపారు. నా దేహంలో ఇప్పుడు ప్రాణవాయువును పూరించి చూపగలను.

యోగంలో పెక్కు పద్ధతులు ఉన్నవి. కాని అందరూ చివరికి ఇక్కడికే రావలసి ఉన్నది. ధ్యానసమయంలో ఇంద్రియ వ్యాపారం అణగి మనస్సు ఒక స్థితిని పొంది, ప్రాణవాయువు నెమ్మదిగా చలిస్తుంది. దానిని కూడ ఆపి చలనం లేకుండ చేస్తారు. మనస్సును నిగ్రహించి ప్రాణవాయువును వశపరచుకో, లేదా ప్రాణవాయువును నిగ్రహించి మనస్సును వశపరచుకో-అని పెద్దలు చెబుతారు.

మనస్సు సాధారణంగా కట్టుబడదు. ప్రాణవాయువు ఆగితే మనస్సు వశ చేయదు. ఇది సమాధి స్థితి. దీనినే నిద్రించకనే నిద్రించి సుఖమనుభవించే ఆనందస్థితి అని అంటారు. ఆ స్థితిలో లోకవ్యవహారమేదీ తెలియదు. ఆ ఆనందస్థితిలోనే మనసు లయించి పోతుంది. ప్రాణవాయువును వశపరచుకొని క్రిందికి, మీదికి ప్రవహింపజేసి మనస్సును వశపరచుకొనవచ్చును.

## మార్గశిరోత్సవం-ఆంతర్యం

వాశి అనే తమిళపదానికి ప్రాణవాయువు అని అర్థం. ఈ పదాన్ని తిప్పితే శివ అని అవుతుంది. మార్గశిర మాసంలో ఇరవైనాళ్లు ఉత్సవం జరుగుతుంది-పగల్ పత్తు అని పదినాళ్లు, రాప్పత్తు అని పదినాళ్లు-పగలు, రాత్రి ఉత్సవం జరుగుతుంది. ఈ ఉత్సవం మొదటి పదినాళ్లు మూల విరాట్టు సన్నిధి నుంచి ఉత్సవ రంగనాథులు క్రిందిస్థితికి దిగివచ్చి మన కోసం - లోకసంగ్రహార్థం యోగం అనుష్ఠించి చూపిస్తారు. సమాధి స్థితిని కలచివేసి, మధ్య స్థితిని కలచివేసి, ఇడాపింగళల మార్గంగా చంద్రకళా, సూర్యకళలను దాటి, త్రిమలాలను దాటి, ఆరు ఆధారాలను దాటి, అర్జున మంటపం చేరుతారు. ఇక్కడ పదినాళ్లు యోగాభ్యాసం చేసిన మీదట పదవనాడు మోహినీ అవతారంగా బయలుదేరుతారు. దీనితత్త్వం కుండలినీ శక్తి బయలుదేరిందని మనకు తెలియజేయడం.

## దొంగనుపట్టే ఉత్సవం

పగల్‌పత్తు పదకొండవనాడు స్వర్గద్వారం తెరువబడుతుంది. ఇది బ్రహ్మరంధ్రం తెరచుకోవడాన్ని సూచిస్తుంది. బ్రహ్మ స్థితి అనేది వేయి స్తంభాల మంటపం. ఇది జాజ్జ్వల్యమానమైన స్థలం. యోగాగ్ని అధికం కావడం వల్ల మంచి పుష్టికరమయిన ఆహారం భుజించాలి. అందువలననే ఇక్కడ ఉదయం 6-00 గంటలకు పొంగలి, మధ్యాహ్నం సంబార్ దోసెలు వినియోగమవుతున్నవి. సంబార్ దోసెను నేతిలోనే ఊరవేసి చేయడం వల్ల సాధారణమైన వ్యక్తి ఒక దోసెను పూర్తిగా ఒకేపూట భుజించడం సాధ్యం కాదు; యోగి భుజింపగలడు. అంతేకాక సెల్వార్ అప్పాలు (ఒకరకం అప్పాలు), బియ్యపు వడలు, సాధారణమైన దోసెలు, చక్కెర పొంగలి మొదలయిన వాటిని ఆరగింపుచేస్తారు. ఎనిమిదవనాడు వేడువరి (దొంగను పట్టుకొనే) ఉత్సవం. ఇది 96 భౌతికతత్త్వాలనుంచి విముక్తి పొందడాన్ని సూచిస్తుంది. ఈనాడు రంగనాథుడు బంగారు అశ్వవాహనంపై ఊరేగింపుగా వేంచేస్తారు. ఇది ప్రాణవాయుగతిని సూచిస్తుంది. యోగాభ్యాసంలో గుర్రమనేది మనస్సు. రంగనాథుడు

అశ్వారూఢుడై విహరిస్తుండగా పరకాలసూరి-తిరుమంగై ఆళ్వార్ రంగనాథుని ఆభరణాలను దొంగిలిస్తాడు. తరువాత భగవత్కృపతో అతనికి జ్ఞానోదయ మవుతుంది. ఇదే వేడుపరి ఉత్సవం. బంగారు గుర్రం ఏమిచేస్తుంది? దొంగల బారినుండి తప్పించుకొనడానికి ముందుకు వెనక్కు పక్కలకు పరుగిడుతుంది. అదే విధంగా మనస్సు పరిపరి విధాల పరుగులిడుతుంది. ఈ ఉత్సవం చూడ డానికి చాల అందంగా ఉంటుంది. ఈ వేడుపరి ఉత్సవం ఇక్కడ జరిగే విధంగా తిరుమంగై యాళ్వార్ అవతరించిన (శీర్కాళి తాలుకా) తిరువాలి తిరునగరిలో మాత్రం జరుగుతుంది. రాప్పత్తు ఉత్సవంలో పెరుమాళ్ పరమ పదద్వారందాటి తిరుమామణి మంటపం (వేయిస్తంభాల మంటపం) చేరుతారు. దీనితాత్పర్యం జీవాత్మ శరీరపతనానంతరం వైకుంఠం చేరడానికి భగవంతుడు సాక్షిగా ఉంటాడని.

యోగంలో 18 గతులున్నవి. ఈ ఉత్సవంలో రంగనాథుడు సర్పగతి, వ్యాఘ్రగతి, గజగతి, వృషభగతి, సింహగతి అనే ఐదుగతులలో వేంచేస్తాడు. పగల్‌పత్తు రాప్పత్తు ముగిసిన పిదప చివరకు నమ్మాళ్వార్‌కు మోక్షం లభించిన ఉత్సవం జరుగుతుంది.

శ్రీరంగం ఉత్తరద్వార సమీపంలో కొళ్ళిడం (ఉత్తర కావేరి) తీరంలో దశావతారకోవెల ఉన్నది. ఇక్కడ భగవన్నారాయణుని దశావతారాల శిల్పాలు ఉన్నవి.

పద్దెనిమిదిమంది సిద్ధులలో ఒకరైన శట్టముని ఈ శ్రీరంగంకోవెలలో సమాధి అయారని చెబుతారు. ఇక్కడ నవగ్రహాలలో శుక్రుడు ముఖ్య స్థానం వహిస్తున్నాడు.

## శ్రీరంగం తత్త్వం

శ్రీరంగం ఆలయంలో మూలవిరాట్టు విగ్రహం పొడవు 21 అడుగులు. కావేరీ నదీప్రవాహంలో ఏర్పడిన మూడుద్వీపాలలో రంగనాథుడు యోగనిద్రావ స్థతో వేంచేసి ఉన్నాడు.

కర్నాటక రాష్ట్రంలోని శ్రీరంగ పట్టణం పశ్చిమరంగం. ఈ శ్రీరంగం మధ్యరంగం. కోవిల్ అడి అనేస్థలం అంతిమరంగం.

ప్రపంచంలో గిగుల పెద్దకోవెల శ్రీరంగం లోని రంగనాథ సన్నిధి. ఈ దేవాలయానికి ఏడుప్రాకారాలు, ఇరవై ఒక్క గోపురాలు, ఇరవైఒక్క ద్వారాలు, 51 చిన్నదేవాలయాలు, 108 మంటపాలు ఉన్నవి.

ఆత్మలయించే స్థలమే ఆలయం. మనస్సును ఇష్టం వచ్చినట్లు త్రిప్పనీయక ఒకచోట స్థిరపరచడానికే కోవెలలలో మూలవిగ్రహం స్థాపితమైంది. నాట్యగానాలతో భగవంతుని భజించి మనస్సును స్థిరపరచడానికి కోవెలలలో ఉత్సవాలు ఏర్పడ్డాయి. కోవెలలలో యోగులను, జ్ఞానులను కలుసుకో వచ్చును. కోవెలలను శిల్పగృహాలుగాను రూపొందించారు.

వేదాలలోను, ఇతర గ్రంథాలలోను మానవ జన్మ ప్రయోజనాన్ని ధర్మార్థ కామమోక్షాలని నాలుగు భాగాలుగా విభజించారు. కావేరిని వేదంగాను, ఉత్తర దక్షిణ కావేరుల నాలుగు తీరాలను ధర్మార్థ కామమోక్షాలుగాను చెబుతారు.

శ్రీరంగం విమానం ఓం అనే ప్రణవాకారం గలదని, నాలుగు కలశాలు నాలుగు వేదాలని చెబుతారు. ఈ విమానాన్ని బ్రహ్మ నిర్మించాడని అంటారు ఈ ఓంకార విమానం 470 కిలోల బంగారంతో నిర్మితమైంది.

ఈ విషయాన్ని పదుగురు ఆళ్వార్లు తమ మంగళాశాసనాల్లో ధ్రువపరిచారు. గర్భాలయంలో మూల విరాట్టయిన యోగనిద్రారంగనాథ విగ్రహం కాక ఆరువిగ్రహాలు-మూర్తులు ఉన్నవి. అవి 1 స్నపనబేరం-తిరుమంజనం (అభిషేకం)కోసం ఉన్న మూర్తి; 2 నంబెరుమాళ్ - ఉత్సవమూర్తి-ఉత్సవాలలో ఈ మూర్తినే ఊరేగిస్తారు; 3 బలిబేరం-బలిహరణానికి వెళ్లే మూర్తి. ఈ మూర్తులను సెల్వర్ అని వ్యవహరిస్తారు. 4 తిరువరంగ మాళిగైయార్; 5 తీర్థబేరం-ముందుచెప్పిన అశ్వత్థ పలాశాది తీర్థాలలో తిరుమంజనానికి వేంచేసే మూర్తి; 6 శయనబేరం-రాత్రిలలో శయనోత్సవాదులు పొందే మూర్తి.

ఇప్పటికీ ఆలయంలో అభిషేకంకోసం కావేరీనదినుంచి ఏనుగులపై వెండిబిందెలతో తీర్థవారిని తీసుకొనివస్తారు. ఆశ్వీజమాసంలో మాత్రం బంగారు బిందెలతో ఈ తీర్థవారిని తెస్తారు.

## ద్వారాలు, గోపురాలు

ఈ గొప్పఆలయానికి 21 ఉన్నతమైన గోపురాలు, 21 మహాద్వారాలు ఉన్నాయి. తూర్పున నాలుగుద్వారాలు, పశ్చిమాన మూడుద్వారాలు, ఉత్తరాన ఏడుద్వారాలు, దక్షిణాన ఏడుద్వారాలు ఉన్నవి. అమ్మామండపం నుంచి కొళ్లిడం వరకు ఉన్న ప్రాంతంలో 364 మంటపాలు ఉన్నవి. కోవెలలో 21 గోపురాలు, 21 ద్వారాలు ఉన్నవి.

కోవెల ఆవరణలో 108 సన్నిధులు లేక చిన్నకోవెలలు ఉన్నవి.

## దేవాలయం ఉత్సవాల విశిష్టత

ఈదేవాలయంలో ప్రతిదినమూ పూజలు నడుస్తుంటాయి. వానిలో అర్చకులకు తెలియకుండానే లోపాలుజరుగడం సంభవం.ఆదోషాలు నివారించడానికి ప్రత్యేకమైన ఉత్సవాలు ఏర్పాటుచేయబడ్డాయి.

పుష్యరథం: ఈరథం భూపతి తిరునాళ్లలో ఊరేగే రథం-తేరు. ఈరథాన్ని ధర్మవర్మ అనేరాజు నిర్మించి ఉత్సవం ఏర్పాటుచేశాడు.

ఫాల్గునరథం:- విభీషణుడు ఒకసంవత్సరం పాటు శ్రీరంగంలో నివసించి తిరురంగనాథునికి బ్రహ్మోత్సవం నడిపించినాడు. అందువలన ఫాల్గునమాసంలో జరిపే ఉత్సవం; ఆదిబ్రహ్మోత్సవం అని వ్యవహరించబడుతున్నది. ఈఉత్సవంలో విభీషణుడు పుష్పకవిమానంవలె తేరును - రథాన్ని అలంకరించి ఉత్సవం నిర్వహించాడు. ఈతేరుకు గోరథమని కూడ పేరుంది.

చైత్రరథం:- చైత్రమాసంలో జరిగే విడప్పన్‌తిరునాళ్లలో చైత్ర రథోత్సవం జరుగుతుంది. సేవార్థుల అభ్యర్థన ప్రకారం రంగనాథుని నక్షత్రమైన రేవతినాడు ఈరథోత్సవం జరుగుతుంది.

రెండువేలసంవత్సరాలకు ముందే శ్రీరంగం పునలరంగ, చీరంగం, మదినరంగం, ఓశియరంగం, అణియరంగం, తిరువరంగం అని పలుపేర్లతో ప్రశంసించబడింది.

కోవెల మొత్తంవైశాల్యం 156 చదరపు ఎకరాలు. వేణుగోపాలకృష్ణాలయం గోపురం హొయసళ వాస్తుకళలో నిర్మించినట్టిది.

శ్రీరంగంలో నివసించిన శ్రీభగవద్రామానుజులు రెండుసంవత్సరాల పాటు శ్రీరంగం సమీపంలోని తిరువెళ్లరై (శ్వేతగిరి) అనేచోట నివసించారు. అప్పుడు కోవెల పూజా పద్ధతి క్రమపరచి కైంకర్యపరులను "పత్తుకొత్తు" గా (పదిగుత్తులుగా-పదివర్గాలుగా) విభజించారు. శ్రీరంగంలో పరిశుద్ధమైన పూజా పద్ధతిని, ఉత్సవపద్ధతిని ఏర్పాటు చేశారు.

దాదాపు 800 సంవత్సరాలకు ముందున్న శ్రీ కూరనారాయణ జీయర్ అనే యతీశ్వరుని కాలంలో కొళ్ళిడం వద్ద కావేరిలో శ్రీరంగనాథునికి తెప్పోత్సవం మహావైభవంగా జరిగేది. అప్పుడొక మాంత్రికుడు తన అల్పబుద్ధితో తెప్ప ప్రవాహంలో కొట్టుకొని పోయేట్టు చేశాడు. దీనిని కనుగొని కూరనారాయణ

జీయర్‌స్వామి తనకుడిచేతి వ్రేలికి ఉన్న దర్భపవిత్రాన్ని కుడివైపునకు త్రిప్పగా తెప్ప యథాస్థానాన్ని చేరింది. పిదప కూరనారాయణ జీయర్‌స్వామి శ్రీరంగం కోవెలకు పడమరగా దాదాపు పదియకరాల భూమిని కొని తెప్పకొలను త్రవ్వించారు. అదిమొదలుగా, తిరుప్పళ్ళియోడం అనేపేరుతో మాఘమాసంలో తెప్పోత్సవం జరుగుతున్నది. బ్రహ్మోత్సవంలో ఎనిమిదవనాడు జరిగే అశ్వవాహనోత్సవం, మాఘ మాసంలో ఎనిమిదవనాడు తెప్పోత్సవం జరుగుతుంది. దీనికి ఉపలక్ష్యంగా నౌకలో అశ్వవాహనం ఉంచుతారు. రంగనాథుడు గుర్రంవాహనంపై రాక తెప్పలో విహరించడం యోగపద్ధతిలో ముందుకు వెళ్లినవారి శరీరం బరువు తగ్గి నీటిపై తేలుతుందని సూచిస్తుంది.

## దోషనివారణకు ఉత్సవాలు

ప్రతిదినమూ భగవంతునికి జరిగే ఆరాధనలో మనకు తెలియకనే కొన్ని దోషాలు కలుగవచ్చు. వాటిని పోగొట్టడానికి కొన్ని ఉత్సవాలు జరుగుతాయి.

చైత్రమాసంలో పూవుల దోషం పోగొట్టడానికి పుష్పాలంకరణోత్సవ). జ్యేష్ఠమాసంలో తీర్థదోషనివారణకు తిరుమంజనోత్సవం (అభిషేకోత్సవం ఆషాఢమాసంలో అన్నదోషం తొలగించడానికి అన్నకూటోత్సవం. శ్రావణమాసంలో యజ్ఞోపవీతదోషనివారణార్థం పవిత్రోత్సవం. ఆశ్వీజమాసంలో ఊయెల దోషాలు పోగొట్టడానికి డోలోత్సవం-ఊంజల్ ఉత్సవం.కార్తీకమాసంలోతాంబూల దోష వస్త్రదోష నివాణార్థం కైశికైకాదశి ఉత్సవం. అగ్నిదోష నివారణార్థం. కార్తీక దీపోత్సవం. మార్గశిర మాసంలో వేదాధ్యయన దివ్య ప్రబంధ పారాయణాలలో కలిగే దోషం పోగొట్టడానికి అధ్యయనోత్సవం. పుష్యంలో పుష్యదోష నివృత్తికి తిరుప్పావాడై ఉత్సవం. మాఘమాసంలో సకలదోష నివృత్తికిగాను దీవిటీల ప్రదర్శనం జరుగుతుంది. ఫాల్గునమాసంలో యాత్రా దోషం పోగొట్టుకొనడానికి బ్రహ్మోత్సవం జరుగుతుంది.

ఉత్సవసమయాలలో దశమూర్తులు ముందు వెళ్లుతారు. పిదప రంగనాథుని ఉత్సవమూర్తి వేంచేస్తాడు. దశమూర్తుల ఊరేగింపులోని ఉద్దేశం దశ వాయువులను, దశనాడులను అణచివేసి, ప్రాణశక్తికి ఆహారపాసీయ శక్తులను అందించాలనేదే.

# వాహనాల వివరణ

బ్రహ్మోత్సవసమయంలో రంగనాథుడు వివిధవాహనాలపై వేంచేస్తాడు. వాటికి ప్రత్యేకమైన అర్థాలు ఉన్నాయి.

సూర్యప్రభ :- వాహనాలలో సూర్యప్రభ ఒకటి. పెరుమాళ్ళు సూర్య ప్రభావాహనంపై వేంచేస్తారు. అంధకార శత్రువైన సూర్యుడు మనముందున్న చీకటిని తొలిగించేటట్లు భగవంతుడు మనహృదయాంధకారాన్ని తొలిగించడానికి వేంచేస్తున్నాడని దీని తాత్పర్యం.

హంసవాహనం :- రంగనాథుడు హంసవాహనారూఢుడై తిరువీధులలో వేంచేస్తాడు. హంస నీటిని వదలి పాలు మాత్రమే స్వీకరిస్తున్నట్టు మనంకూడ ప్రాపంచిక జీవితపంకంలో కూరుకొనిపోక యోగమార్గంలో ప్రగతిని సాధించాలి అనేది దీని తాత్పర్యం.

సింహవాహనం:- రంగనాథుడు సింహారూఢుడై వేంచేయడంలో ఉద్దేశం అహంకారాన్ని అణచివేయాలని.

గరుడవాహనం :- గరుడుడు వేదస్వరూపుడని పెద్దలంటారు. వేదాత్మా విహగేశ్వరః. వెలుపలి శబ్దాలను-నాదాలను జయిస్తే, భగవంతుని చేరి వీణా నాదాన్ని-దివ్య వీణా నాదాన్ని- వినవచ్చునని దీని భావం. ఈ విషయాన్ని గరుడ వాహనారూఢుడైన రంగనాథుడు సూచిస్తున్నారని పెద్దలవాక్యం.

యాళివాహనం :- యాళి అనే జంతువు సింహగజస్వరూప సమ్మేళనం. ఇది సింహంకన్న శ్రేష్ఠమైనది. మంచిదికాని దాన్ని తొలగించి పౌరుష శాంతి వైరాగ్యాలను పెంపొందించుకోవాలని ఈవాహనం సూచిస్తున్నది.

శేషవాహనం :- రంగనాథుడు ఆదిశేషవాహనంపై వేంచేస్తాడు. కుండలినీ శక్తి అనే పామును వశపరచుకొన్నవాడను నేనే అని భగవంతుడు సూచిస్తున్నాడు. కుండలినీశక్తిని ఉచ్చస్థితికి తెచ్చి బ్రహ్మస్థితిని పొందాలని దీని సూచన.

హనుమద్వాహనం :- రంగనాథుడు హనుమద్వాహనంపై వేంచేయడం లోని ఆంతర్యం మనస్సు కోతి వంటిది, దానిని అదుపులో పెట్టుకోవాలి అని.

అశ్వవాహనం :- గుర్రం జీవుని శ్వాసకు ప్రతీక. శ్వాసను అవసరం లేని మార్గాలలో వినియోగించరాదు. సరైనమార్గంలో వినియోగమై అనాసక్తంగా

ఉండేశ్వాసను ప్రాణయోగమంటారు ఆ ప్రాణ యోగాన్ని అనుసరించడంవల్ల కలిగే దివ్య సంపదను ఈ వాహనం సూచిస్తుంది.

రథోత్సవం :- రథం శరీరాన్ని సూచిస్తుంది. అహంకారాన్ని త్యజించి శ్వాసను క్రమక్రమంగా నిగ్రహించినట్లయితే, శరీరాన్ని వశపరచుకొని యోగి కావచ్చునని దీనిసూచన. రథానికి మొత్తం ఆరుచక్రాలున్నవి. ఇవి ఆరు ఆధారాలు. ఈ ఆరు ఆధారాలనుదాటి పైస్థితికి వెళ్లాలనడాన్ని రథోత్సవం సూచిస్తున్నది.

శబ్దావరణోత్సవం :- రథోత్సవం మరుసటి దినం శబ్దావరణోత్సవం. ఈ ఉత్సవంలో మేళతాళాదులసవ్వడి ఉండదు. శరీరాన్ని తమ వశంలో ఉంచు కొన్నవారికి మౌనదశ ప్రాప్తిస్తుందని దీని సూచన. ఈ దినం అర్చకులు భగవద్రామానుజులను చేతులతో ఎత్తుకొని రంగనాథుని సమ్ముఖానికి తీసుకొని వస్తారు. రామానుజులకు రంగనాథుల మర్యాదలు జరుగుతాయి. దీనిని కైత్తల సేవ - కరతలసేవ - అని వ్యవహరిస్తారు. మౌనస్థితిని పొందిన యోగులను భగవంతుడు ఆదరించి ఆత్మీయులనుగా చేసుకుంటాడు అని దీని తాత్పర్యం.

గజవాహనం :- గజవాహనానికి రెండు కుంభస్థలాలు, రెండు కొమ్ములు ఉన్నవి రాగద్వేషాలు రెండు కుంభస్థలాలు, కామక్రోధాలు రెండు కొమ్ములు. ఇవి ఉన్న తిరిమలాలను అణగార్చి వేయాలి.

గజవాహనోత్సవం జరిగిన తర్వాత రంగనాథుడు రంగవిలాస మంట పానికి ఎదుటవున్న నాలుగు స్తంభాలున్న నీరాజన మంటపానికి వేంచేస్తారు. అప్పుడు దృష్టిదోషం పోగొట్టే తంతు జరుగుతుంది. తర్వాత రంగనాథుడు ఆండాళ్ సన్నిధికి వచ్చి పూలదండలు మార్చుకుంటారు. త్రిగుణాత్మకమైన ప్రకృతిని జయించిన వానిని ఆండాళయినలక్ష్మి పూలదండలతో సన్మానిస్తుందని దీని భావం. కోరినకోరికలన్నీ సిద్ధిస్తాయని సూచన.

పాలించేవల్లకి :- దీనిని తమిళ్‌లో ఆళుంపల్లాక్కు అంటారు. రంగడు ఈ వల్లకిలో వేంచేస్తాడు. యోగాభ్యాసంలో ఉన్నతస్థితిని పొందినవారు తమ యోగబలంతో మనస్సును ఊగిసలాడ కుండా అరికట్టి తమ వశంలో ఉంచు కుంటారు. అందువల్లనే దీగికి పాలించే వల్లకి అని వ్యవహారం.

కల్పవృక్షవాహనం :- కల్పవృక్షం కోరినవారికి కోరినవి ఇచ్చే వృక్షమని పెద్దలు చెబుతారు. యోగ పద్ధతితో మనం భగవంతుని ధ్యానిస్తే కల్పవృక్షమైన భగవంతుడు మనకు సకలమూ అనుగ్రహిస్తాడని దీని భావం.

## మాసోత్సవాలు

రంగనాథునికీ, రంగనాయకి తాయారుకు ప్రతినెల జరిగే ఉత్సవాల వివరాలు క్రింద పొందు పరచిన పట్టికనుంచి తెలుసుకోవచ్చు.

| నెల | రంగనాథునికి జరిగే ఉత్సవాలు | తాయారుకు జరిగే ఉత్సవాలు |
|---|---|---|
| చైత్రం | బ్రహ్మోత్సవం | లేదు |
| ,, | చైత్రపూర్ణిమోత్సవం | లేదు |
| ,, | గ్రీష్మోత్సవం | ఉంది |
| వైశాఖం | వసంతోత్సవం | ,, |
| జ్యేష్ఠం | మహాభిషేకోత్సవం | ,, |
| ఆషాఢం | కావేరియాత్రోత్సవం 18 వ దినాన లేక 28 వ దినాన | లేదు |
| శ్రావణం | పవిత్రోత్సవం | లేదు |
| భాద్రపదం | లేదు | నవరాత్రి |
| ఆశ్వీజం | డోలోత్సవం | ఉంది |
| కార్తీకం | దీపోత్సవం | లేదు |
| మార్గశిరం | అధ్యయనోత్సవం 21 దినాలు (దీనినే వైకుంఠైకాదశ్యుత్సవమంటారు.) | అధ్యయనోత్సవం 10 దినాలు |
| పుష్యం | బ్రహ్మోత్సవం | లేదు |
| మాఘం | తెప్పోత్సవం | లేదు |
| ఫాల్గునం | ఫాల్గునోత్సవం - ఆది బ్రహ్మోత్సవం | లేదు |

పుష్య, మాఘమాసాల్లో జరిగే ఉత్సవాలలో మాత్రం రంగనాథుడు ఉత్తర వీధులలో వేంచేస్తాడు. తక్కిన నెలల ఉత్సవాలలో చిత్ర వీధులలో వేంచేస్తారు. మాఘమాసోత్సవాలలో ధ్వజారోహణం ఉండదు.

పెరుమాళ్లు పుర వీధులలో వేంచేసేటప్పుడు సింహగతిలో బయలు దేరుతారు. అనగా భక్త సంరక్షణార్థం బయలువెడలేటప్పుడు సింహం వలె బయలుదేరుతారు. భగవంతుడు బయలుదేరడం చూడగానే భక్తుల దుఃఖాలు సూర్యుణ్ని చూచిన మంచువలె తొలగిపోతాయి. భక్తుల కష్టాలు తొలగగానే భగవంతుడు తన స్థానానికి సర్పగతితో వెళ్లుతారు.

## రంగనాథునికి మాత్రం జరిగే మాసోత్సవాలు

కేవలం రంగనాథుని ఆలయంలో రంగనాథునికి మాత్రం జరిగే ఉత్సవాలు కొన్ని ఉన్నాయి. అవి పుష్య, మాఘ, ఫాల్గున. చైత్రమాసాలలో జరుగుతాయి. వాటిని బ్రహ్మోత్సవాలు అని అంటారు. వాటి వివరణ ఇది.

### పుష్యమాసంలో

| దినం | సమయం | ఉత్సవం | సమయం | ఉత్సవం |
|---|---|---|---|---|
| 1 | ఉదయం | అద్దాలఅరలో మూల బింబం ఎదుట రక్షా బంధనం, ధ్వజారోహణం | సాయంత్రం | ఉభయ వాచ్చి యార్లతో రంగ నాథుని ఊరేగింపు పిదపరంగనాథుడు మాత్రం యాగ శాలకు వేంచేస్తారు. తిరుమంజనం |
| 2 | ,, | సూర్యప్రభ, రంగనాయకి కోవెల ముందున్న మంటపంలో | ,, | హంసవాహనం |
| 3 | ,, | సింహవాహనం, సాహుకార్ మంటపంలో | ,, | యాళివాహనం |
| 4 | ,, | చంద్రప్రభ, వల్లకిలో వీరేశ్వరయాత్ర | ,, | గరుడవాహనం |
| 5 | ,, | శేషవాహనం, రంగ విలాస మంటపంలో | ,, | హనుమద్వాహనం |

| | | | | |
|---|---|---|---|---|
| 6 | ఉదయం | కల్పవృక్షవాహనం, శుక్రవారంతోపులో | సాయంత్రం | గజవాహనం |
| 7 | | .................. | | ఉభయనాచ్చియార్లతో బయలుదేరి తాయార్ సన్నిధిలో తిరుమంజనం |
| 8. | ,, | పల్లకి, రంగవిలాస మంటపంలో | ,, | అశ్వావాహనం. |
| 9. | ,, | రథోత్సవం | రాత్రి | రంగనాయకితాయార్ సన్నిధిలో తిరుమంజనం, తీర్థవారి. |
| 10. | ,, | ఏకాదశీ మంటపంలో తిరుమంజనం | ,, | శబ్దావరణం, వీధులలో వేంచేసి, చక్రత్తాళ్వార్ సన్నిధి ప్రాకారం గుండా రామానుజసన్నిధి ప్రవేశం, రామానుజుల కరతల సేవ. |
| 11. | ,, | — | ,, | పాలించే పల్లకి(అళుం పల్లాక్కు) రంగివిలాస మంటపంలో. |

## మాఘ మాసంలో

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఉదయం | తిరుక్కురళప్పన్ సన్నిధి (త్రివిక్రమ సన్నిధి) | సాయం. | హంస వాహనం, వాహన మండపం. |
| 2. | ,, | పల్లకిలో ఊరేగింపు నొచ్చియం గ్రామ మంటపంలో | ,, | అక్కడినుంచి హనుమద్వాహనం. |
| 3. | ,, | పల్లకి సేవ. ఒట్టయం రామరాయర్ మంటపం. | ,, | అక్కడినుంచి కల్పకవృక్షవాహనం. |

| | | | | |
|---|---|---|---|---|
| 4. | ఉదయం | పల్లకి సేవ. కాళిక్కరై సెట్టి తోటలో. | రాత్రి | అక్కడినుంచి గరుడ వాహన సేవ. |
| 5. | ,, | పల్లకి సేవ తాళక్కుడి గ్రామ మంటపంలో | ,, | అక్కడనుంచి చంద్ర ప్రభ |
| 6. | ,, | పల్లకి సేవ పులిమంటపములో | ,, | అక్కడినుంచి గజ వాహనం |
| 7. | — | — | ,, | ఉభయ నాచ్చియార్లతో సహ ఊరేగింపు. దారిలో రంగనాయకి సన్నిధిలో నీరాజనం. సరాసరి మూలస్థాన ప్రవేశం |
| 8. | ,, | ఉభయ నాచ్చియార్లతో ఊరేగింపు | ,, | తెప్పోత్సవం. |
| 9. | ,, | పల్లకి సేవ. తెప్పమంటపంలో తిరుమంజనం. | ,, | సూర్యప్రభ, దివిటీల ప్రదర్శనం, చిత్ర వీధిలో ఊరేగింపు. |

ఫాల్గుణ మాసంలో

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఉదయం | గరుడధ్వజారోహణం | సాయంత్రం | ఉభయ నాచ్చియార్లతో ఊరేగింపు. |
| 2. | ,, | గరుడ మంటపంలో సేవ, సరాసరి మూలస్థాన ప్రవేశం | | 8 గంటలకు జీయర్ పురానికి యాత్ర. |
| 3. | ,, | ,, | ,, | జీయర్ పురంనుంచి తిరిగిరాక. |
| 4. | ,, | పల్లకిలో ఇరట్టై మంటప ప్రవేశం. | ,, | అక్కడినుంచే గరుడవాహనం. |
| 5. | ,, | శేషవాహనం, శేషరాయ మంటప ప్రవేశం. | ,, | కల్పవృక్ష వాహనం. |

| | | | | |
|---|---|---|---|---|
| 6. | ఉదయం | తెల్లవారుజామున 3-00 కు పల్లకిలో ఉరైయూర్ (నిచుళాపురి) యాత్ర | రాత్రి | ఉరైయూర్‌లో కమలవల్లి తాయార్‌తో ఏకాసన సేవ, తిరుగు ప్రయాణంలో వెలువలి ఆండాళ్ సన్నిధిలో పూల మాలల మార్పు. |
| 7. | ,, | - | ,, | ఉభయ నాచ్చియార్లతో ఊరేగింపు. |
| 8. | ఉదయం | పల్లకిలో కావేరి ఉత్తరపు ఎల్లలోని మంటపం ప్రవేశం. | ,, | అశ్వవాహనం. |
| 9. | ,, | ఉత్తర ఫల్గుని ఉత్సవం, చిత్ర ఉత్తర వీధులలో ఊరేగింపు తర్వాత తాయార్ సన్నిధి ప్రవేశం. | ,, | - |
| 10. | ,, | గోరథోత్సవం. ఏకాదశీ మంటపంలో తిరుమంజనం. | ,, | తిరువీధులలో ఊరేగింపు. తాయార్ సన్నిధిలో నీరాజనం, రామానుజుల సన్నిధిలో కరతల సేవ, ధ్వజారోహణం. |
| 11. | ,, | గరుడ మంటపంలో సేవ | ,, | పాలించే పల్లకి సేవ. |

## చైత్ర మాసంలో

| | | | | |
|---|---|---|---|---|
| 1. | ఉదయం | ధ్వజారోహణం, అద్దాల మంటపంలో సేవ రక్షాబంధనం. | సాయం | ఉభయ నాచ్చియార్లతో ఊరేగింపు, యాగశాలలో తిరుమంజనం. |
| 2. | ,, | పల్లకిలో కోడియాళం శేషాద్రి అయ్యంగార్ మంటప ప్రవేశం. | ,, | కల్పవృక్ష సేవ. |

| | | | | |
|---|---|---|---|---|
| 3. | ఉదయం | వల్లకి సేవ, సాహుకార్ మంటప ప్రవేశం. | రాత్రి | అక్కడినుంచి యాళి వాహనం. |
| 4. | ,, | చంద్రప్రభ, మేలూర్ కోమటి సెటియార్ మంటప ప్రవేశం. | ,, | అక్కడినుంచి గరుడ సేవ. |
| 5. | ,, | శేషవాహనం, పట్టునూల్ సాలెల మంటప ప్రవేశం. | ,, | అక్కడినుంచి హనుమద్వాహనం. |
| 6. | ,, | హంసవాహనం, నాగప్పిళ్లై మంటప ప్రవేశం. | ,, | గజ వాహనం, లోపలి ఆండాళ్ సన్నిధిలో మాలల మార్పు. |
| 7. | ,, | - | ,, | ఉభయ నాచ్చియార్లతో ఊరేగింపు, రాత్రి తాయార్ సన్నిధిలో తిరుమంజనం. |
| 8. | ,, | రజత అశ్వవాహనం, వండలూర్ చప్పరంలోను, రంగవిలాస మంటపంలోను సేవ. | ,, | స్వర్ణఅశ్వవాహనంపై వైయాళి సేవ (వేట) |
| 9. | ,, | చైత్ర రథోత్సవం | ,, | రేవతీ మంటపంలో తిరుమంజనం. |
| 10. | ,, | - | ,, | శబ్దావరణోత్సవం, తిరువీధులలో ఊరేగింపు, చక్రత్తాళ్వార్ సన్నిధిమీదుగా వెళ్ళి రామానుల సన్నిధిలో కరతల సేవ మూలస్థాన ప్రవేశం. |

11. ఉదయం మధ్యాహ్నం రంగవిలాస మంటప ప్రవేశం. రాత్రి పాలించే పల్లకి సేవ.

## నిత్య సేవా సమయాలు

రంగనాథాలయంలో ఉత్సవాలు లేనినాళ్ళలో జరిగే నిత్య సేవలు, వాటి సమయం, భక్తులు చెల్లించుకోవలసిన కట్నాలు (రుసుములు) ఈ విధంగా ఉన్నవి.

ఉదయం :-

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| గం॥ | 6-30 | నుంచి | 6-45 | వరకు | విశ్వరూప సేవ, అర్జిత సేవ |
| | 6-45 | ,, | 7-15 | ,, | విశ్వరూప సేవ, ధర్మ సేవ |
| | 7-30 | ,, | 8-45 | ,, | పూజాసమయం - దర్శనం ఉండదు. |
| | 8-45 | ,, | 12-00 | ,, | అర్జిత సేవ. |
| | 12-00 | ,, | 1-00 | ,, | ధర్మ సేవ. |
| | 1-00 | ,, | 2-30 | ,, | విశ్రాంతి సమయం. పూజా సమయం. |

సాయంకాలం :-

| | | | | | |
|---|---|---|---|---|---|
| గం॥ | 2-30 | ,, | 4-00 | ;, | ధర్మ సేవ |
| | 4-00 | ,, | 6-00 | ,, | అర్జిత సేవ |
| | 6-00 | ,, | 6-45 | ,, | పూజా సమయం |
| | 6-45 | రాత్రి | 8-00 | ,, | అర్జిత సేవ |
| రాత్రి :- | 8-00 | ,, | 9-00 | ,, | ధర్మ సేవ |
| | 9-00 | ,, | 9-30 | ,, | పూజా సమయం. |

## సేవా రుసుం వివరాలు

1. అర్జిత సేవా సమయాలలో మాత్రమే అర్చనలు చేయబడుతాయి.
2. ధర్మ సేవా సమయంలో కర్పూర నీరాజనం చేసుకోవచ్చు.

3. ఒక అర్చన చీటికి ఒకరికి మాత్రమే ప్రవేశం ఉంటుంది.

4. ఆర్జిత సేవా సమయంలో ఒకరికి ఒక రూపాయి కట్నం (రుసుము) చెల్లించాలి.

5. దినసరి విశ్వరూప సేవాసమయంలో ప్రత్యేకమార్గంలో వెళ్ళి ఒకసారి దర్శనం చేసుకొనడానికి మనిషి ఒకటింటికి చెల్లించవలసిన రుసుం రూ॥ 500-00 (ఒకరికి మాత్రం)

ప్రతి శుక్ర, శని, ఆది వారాలలో శ్రీ చక్రత్తాళ్వార్, తాయార్ సన్నిధిలో ధర్మ సేవలతో పాటు ఆర్జిత సేవలు కూడ ఉన్నవి.

లక్షార్చన చేయడానికి రూ॥ 180 చెల్లించి సేవాధికారినుంచి ముందుగా అనుమతి పొందాలి.

---o---



1980 జనవరి లో
మౌనవ్రతం
అవలంబించడానికి పూర్వం



1982 జూలై లో
మౌనవ్రతం వదలిన తరువాత




(1) Thayar Varantha M.
(2) Simmadari Appan S.
(3) Periavachan Pillai S.
(4) Kilapattabhiraman S.
(5) Srinivasa Perumal S.
(6) Thirumazhisai Alwar S.

(7) Cherakkulavalli Nachiyar S.
(8) Tiruvunnazhi
(9) Rajamahendran Tiruveedhi
(10) Kulasekaran Tiruveedhi
(11) Alinadan Tiruveedhi
(12) Agalangan Tiruveedhi

(13) Dwajasthambam and Balipeetam
G Gate or Gopuram
S Sannadhi
M Mandapam

# శ్రీరంగం,

# తిరువానయ్ కోవెల

(సిద్ధ సిద్ధాంత ప్రకారం నిర్వచనము)

ఈ పుస్తకము ఇంగ్లీషులోను, తమిళంలోను, హిందీ లోను, తెలుగులోను, కన్నడంలోను అనువదించబడినది.

సిద్ధయోగంలో ఈ రచయిత అనుభవాలు
తమిళంలోను, ఇంగ్లీషులోను అనువదింపబడినవి.

సర్వరోగ నివారిణి ఈ యోగాగ్ని.
వైద్యునితో ఇక పనిలేదు.

ఈ పుస్తకాలు శ్రీ రంగం ఆలయంలోను, జంబుకేశ్వ రాలయంలోను లభించును. యోగము గురించి వివరములు కోరువారు రచయితకు వ్రాయగలరు.

**TELUGU** **1st, April, 1988.**

Printed at RAMESH PRINTERS & PUBLISHERS, 1-1-214/A,
Chikkadapally, Hyderabad - 20.